# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటోశీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.

ఇప్పుడు మదరాసులోనూ దక్షిణాదినీ క్రిక్కిరిసిన ప్రేక్షక
జనానికి ప్రదర్శింపబడుతున్నది






దేవి ఫిలింస్ సమర్పించు

# మురిపించే మువ్వలు

నిర్మాత, డైరెక్షన్: ఎం. వి. రామన్

సంగీతం: ఎస్. ఎం. సుబ్బయ్యనాయుడు

నటీ నటులు

జెమినీ గణేశన్ • సావిత్రి • కమలాలక్ష్మణన్
కుచల కుమారి • మనోహర్ • సారంగపాణి
మాధురి • ముద్దులక్ష్మి












# పాఠకుల లేఖలు

## ఫిబ్రవరి 1962

కౌసల్యతో రాముడు [జనవరి "అయోధ్యాకాండ"] చెప్పడం మీరు రాసినట్టుకాదు. "వంటవాళ్ళచే పక్వం చేయబడిన మాంసం దొరకదు" అని వుండాలి. రాముడు అబద్ధ మాడాడన్న ఆభాసం "చందమామ"కు ఇకముందు రాకూడదు.

—ఆర్. నరసింహచెట్టి, మద్రాసు

[మాంసం వర్జిస్తానని రాముడు కౌసల్యతో అన్నట్టుగా రాశాం. నిజంగా రాముడు అరణ్య వాసం మాంసాహారంతోనే ప్రారంభించాడు గనక ఇది రాముడి చేత అబద్ధ మాడించటమే అవుతుంది. పొరపాటు ఎత్తిచూపినందుకు కృతజ్ఞులం—సం.]

ఈ నెల "చందమామ"లో అన్ని కథలు ఒక ఎత్తు, "శాపం పొందిన దేవుడు" [బేతాళ కథ] ఒక ఎత్తు.

—వి. ఎస్. కృష్ణయ్య, కోలారు

"శాపం పొందిన దేవుడు", "ఇల్లు పట్టిన భూతం" కథలు చాలా బాగున్నవి, "రాకాసి లోయ" చందమామకు ప్రత్యేకాభరణం.

—ఆర్. పద్మావతి, మద్రాసు

"ప్రాణస్నేహితులు" చాలా బాగుంది. "సజ్జనుడి పాట్లు" చదువుతుంటె నిజంగా ఏడుపొచ్చింది. "రాకాసిలోయ" ఈ నెల పరాకాష్ఠనంది చాలా బాగుంది.

—రాము, గుంటూరు

"ప్రాణస్నేహితులు" చదివేటప్పుడు నాకు అలాంటి స్నేహితురాలు లభ్యమయ్యేనా అనిపిస్తుంది. యిలాంటి కథలు యింకా ప్రచురిస్తే మీకెంతో కృతజ్ఞులం.

—సి. హెచ్. లీలా, పెరవలి

"ఇల్లు పట్టిన భూతం" చాల బాగున్నది. రచయిత శ్రీ త్రిపురారి సత్యనారాయణకు కృతజ్ఞతలు తెలుపగలరు.

—ఎస్. బాపు, మంథని

ఈ నెల "చందమామ"లో నన్నత్యంతంగా ఆకర్షించిన ఉత్పల సత్యనారాయణాచార్యగారి నూతన గేయ కథ ["పార్వతీ కల్యాణం"] చదువుతుంటే కాళిదాస "కుమారసంభవమ్" అరటిపండు ఒలిచినట్టు అవగాహన అవుతున్నది.

—పుల్లేవు మురళీధరరావు, పెంద్రారోడ్.

"రాకాసిలోయ" రానురాను పాఠకుల హృదయాలను చూరగొంటున్నది. "పార్వతీ కల్యాణం" రచయితకు మా అభినందనములు తెల్పేది.

—ఎస్. రామమూర్తి, చెన్నూరు

"చందమామ" మా యింటికి వేంచెయ్యుటము తోనే పిల్లలము మేముగాక పెద్దలు (మా నాయనమ్మ) గుండుభీమన్న కథ చదవరా అనటమే తరువాయి, మేము చదువుతూ కడుపుబ్బ నవ్వటము ఆరు మాసాలనుంచి జరుగుతున్నది. గుండుభీమన్న రచయిత ఎవరో తెలుపనందుకు సంతోషం. తెలిపితే వారికి మా కృతజ్ఞతాభివందనములు ఎలా తెలుపుకోవాలో బోధపడుటలేదు.

సిహెచ్. విశ్వనాథం, పినపాక

2, 3 నెలల్లోనే ఈ [గుండుభీమన్న] కథలు ముగించుదురన్నారు. అందుకు నేను చాల విచారపడితిని.

—తుమ్మల రఘునాథరాయులు, అప్పికట్ల

## 'ఆయనను మెప్పించుట అంత సులభంకాదు...'



బొంబాయి 16, మహీమ్ లో 8 8, యూనియన్ హౌస్ యందున్న శ్రీమతి. ఆర్.ఆర్. ప్రభు ఇలా చెప్పుచున్నది; 'ఆయనకేదీ మెప్పులేదు. ఇంక బట్టల సందర్భంలోనా...!' ఇప్పుడు ఆయన బట్టలన్నిటినీ సన్‌లైట్ తో ఉతుకుతున్నాను...' ఆయనకూ, నాకూ పరమానందం! సన్‌లైట్ సమృద్ధిగా నురగ నిస్తుంది, ఉతికే పని నాకెంతో సులభం!
'నేను ఉతికేవన్నీ తెల్లగాను, కాంతిగాను ... పరిశుభ్రంగా వుంటాయి! నాకు సన్‌లైట్ తప్ప మరేదీ నచ్చదు!'

బట్టలను శుభ్రంగా ఉతుకు ఒక ఉత్తమైన, నమ్మదగు సన్‌లైట్ వంటిదింకేదీ లేదని గృహిణులు తెలుసుకున్నారు. మీరు కూడా గ్రహించారు.

# సన్‌లైట్




మీ బట్టలకు వరప్రసాదం!

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

S.30-X29 TL

రిపబ్లిక్ దినోత్సవ
కానుక!

జనవరి
26





జగ్గయ్య సమర్పించు... జాగృతి చిత్ర....

# పదండి ముందుకు!

దర్శకత్వం.. వి.మధుసూదనరావు • నిర్మాత.. టి.కృష్ణమూర్తి B.A.B.L.








విడుదల: వాణీ ఫిలిం డిస్ట్రిబ్యూటర్స్ విజయవాడ..గుంతకల్..సికింద్రాబాద్..బెంగుళూర్

# ఉత్సాహం తో ఉప్పొంగించేవి!

గగన మందు! కుప్పి గంతులు!
సాతెవారి బిస్కట్లతో మీరు పెరిగే
విధం అదే. సాతె చాకొలెట్లు
మంచి ఆహారానికి సహచర
మైనవి మరియు అవి అన్నిచోట్లా
ఆనందంగా భుజింపబడు చున్నవి.




సాతె బిస్కట్ అండ్ చాకొలెట్ కం. లి.,
పూనా-2

సినిమా
తారలు
మెచ్చిన




రెమి
పౌడర్



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

సుమారు రెండువేల ఏళ్ళక్రితం వాల్మీకి రామాయణం రచించాడు. నాటి నుంచి వెలువడిన ఎన్నో వేల రామాయణాలలో కథాంశాలు కూడా మారిపోయాయి. ఈ పరిస్థితిలో "చందమామ" పాఠకులకు వాల్మీకి రామాయణంలోని కథాంశాలు తెలియజేయటానికిగాను కృషి చేస్తున్నాం. అందుచేత పాఠకులు తాము ఎక్కడో విన్న విషయాలను బట్టీ, చదివిన విషయాలనుబట్టీ మేము రామాయణ కథను మారుస్తున్నామనుకోరాదు. "రాముడు మాంసం తింటాడా?" "రాముణ్ణి సీత 'నీవు' అంటుందా?" మొదలైన కుశంకలు కొందరు పాఠకులకు కలుగుతున్నాయి. రామాయణంలో పాఠకులు ఊహించని విషయాలు ఇంకా ఎన్నో ఉండవచ్చు.

సంపుటి 30 : ఫిబ్రవరి 1962 : సంచిక 2

CHITRA



# భారత చరిత్ర



క్రీ. పూ. 6 వ శతాబ్దంలోనే, బింబిసారుడి కాలంలో గాంధార దేశంపై పర్షియను చక్రవర్తి సైరస్ అనేవాడు దాడిచేసి కాపిశ అనే నగరాన్ని నిర్మూలించి, సింధు నదికి పడమట ఉండే గాంధార దేశాన్ని తన సామ్రాజ్యంలో కలుపుకున్నాడు.

పూర్వపు గాంధార దేశం సింధునదికి తూర్పుగానూ, పడమరగానూ విస్తరించి వుండేది. పడమరగా వుండే ప్రాంతానికి పుష్కలావతి అని పేరు. దానికి తూర్పుగా తక్షశిల ఉండేది. ఇది సుభిక్షమైన, సుపాలితమైన రాజ్యం. దీని రాజధాని రావల్పిండికి వాయువ్య దిశగా 20 మైళ్ళ దూరాన ఉండేది. ఈ నగరపు వర్తకం ప్రపంచ ఖ్యాతి పొందినది. గొప్ప విద్యాకేంద్రంగా ఇది గడించిన ఖ్యాతి అంతులేనిది. మహాభారతం మొట్టమొదటిసారి తక్షశిలలోనే పఠించబడిందని చెబుతారు.

తక్షశిల రాజ్యానికి ఎగువగా ఉరశ, అభిసార అనే దేశాలుండేవి. నైరృతీ దిశగా పూరులు (లేక పౌరవులు) అనే జాతివారుండేవారు; వీరు వేదకాలం నాటికే ప్రసిద్ధులు. ఝీలం, చీనాబ్ నదుల మధ్య ఒక రాజ్యాన్ని పెద్ద "పోరస్" అనేవాడూ, చీనాబ్, రావీ నదుల మధ్యప్రాంతాన్ని చిన్న "పోరస్" అనేవాడూ పాలించినట్టు గ్రీకు చరిత్రకారులు రాశారు. రావీ, చీనాబ్ నదుల దిగువప్రాంతాలలో శిబులూ, మాలవులూ, క్షుద్రకులూ, అంబష్ఠులూ అనే జాతులవారు నివసించేవారు. ఇవన్నీ స్వతంత్ర జాతులు. వీటిలో కొన్ని ప్రజాతంత్రం కలవి. అయితే వీరిమధ్య స్పర్థల వల్ల విదేశీయులు భారతదేశంపై దాడి చేసే అవకాశం చిక్కింది.

యూరపు ఆగ్నేయప్రాంతంలో మేసిడన్ అనే బల సంపన్నమైన యవన రాజ్యం-

## 5. అలెగ్జాండరు దండయాత్ర



ఉండేది. క్రీ. పూ. 336 లో అలెగ్జాండర్ అనే సమర్థుడైన యువకుడు ఈ దేశానికి రాజయాడు. ఇతను డేరియస్ సంతతికి చెందిన పర్షియన్ రాజులను క్రీ. పూ. 333 లోనూ 331 లోనూ రెండుసార్లు ఓడించి, వారి రాజ్యాన్ని ఆక్రమించాడు. 330 కల్లా పర్షియనుల సామ్రాజ్యం అలెగ్జాండరు అధీనంలోకి వచ్చింది. పర్షియనుల పరిపాలనలో ఉండిన భారత భూభాగాలను స్వాధీన పరచుకునేటందుకు అతను క్రీ. పూ. 327 లో హిందూకుష్ పర్వతాలు దాటి వచ్చాడు. పుష్కలావతి మొదలైన అనేక నగరాలను జయించి అతను 326 లో పడఖటి పంతెన మీదుగా సింధునదిని దాటి తూర్పుగా వచ్చాడు. తక్షశిల రాజైన అంభి అనేవాడు అలెగ్జాండరుకు ఘనమైన ఆతిథ్యమిచ్చి, గొప్పగా సహాయపడ్డాడు.

అంభి ప్రవర్తనను చూసి తీవ్రంగా నిరసించినవాడు పెద్ద పౌరవ రాజు (పోరస్.) ఇతను మహా వీరుడూ, మహా కాయుడూనూ. అలెగ్జాండరు వితస్తా (ఝీలం) నది చేరే సరికి అవతలి గట్టున బ్రహ్మాండమైన పౌరవ సేన యుద్ధ సన్నద్ధమై నిలిచి ఉన్నది. నది మంచి ఉరవడిలో ఉన్నది. ఎదుటఅపారమైన సేన నిలిచి ఉన్నది. నది



దాటటం అసాధ్యమని గ్రహించి అలెగ్జాండరు మాయోపాయం చేశాడు. తన సేనలను అటూ ఇటూ చెదరగొట్టినట్టు నటించి, పదిహేడు మైళ్ళ ఎగువను సమావేశపరిచి అక్కడ నది దాటించి పౌరవ సేనతో యుద్ధానికి తలపడ్డాడు. కొద్దిమంది సైనికులు పౌరవ సేనలు చూస్తూండగా నది దాట యత్నించి నాశనమయారు.

పౌరవ సేనలో 30,000 మంది కాల్బలమూ, 4,000 అశ్వికులూ, 300 మంది రథికులూ, 200 మంది ఏనుగు లెక్కిన యోధులూ ఉన్నారు. అలెగ్జాండరు సేనలు ముందు దెబ్బ తీసినదాకా వేచి వుండక



తామే ముందుదెబ్బ తీసివుంటే పౌరవ రాజు ఓడి వుండకపోను. అలెగ్జాండరు సేనలో అశ్వికబలం హెచ్చు. వారి దాడిని రథికులు తట్టుకోలేకపోయారు. బురదలో కాల్బలం కదలలేకపోయింది. ఏనుగులు వెనక్కు తిరిగి తమ సైన్యాన్నే మట్టు బెట్టాయి. తన సేన చెల్లాచెదరై నప్పటికీ ఏనుగు నెక్కిన పౌరవ రాజు తీవ్రమైన గాయం తగిలినదాకా యుద్ధం చేశాడు. అయనను పట్టుకుపోయి తన ఎదట పెట్టి నప్పుడు అలెగ్జాండరు, "మిమ్మల్ని నే నెలా చూడాలి ?" అని అడిగితే పౌరవ రాజు, "రాజులాగా ప్రవర్తించండి !" అన్నాడట. అలెగ్జాండరు ఆయన రాజ్యాన్ని ఆక్రమించక అయనకే తిరిగి ఇచ్చివేశాడు.

అలెగ్జాండరు గంగాతీరందాకా జయించు కుంటూ పోదామనుకున్నాడు. కాని అతని సైన్యాలు యుద్ధంతో విసిగి ముందుకుపోవ నిరాకరించాయి. అలెగ్జాండరు కొంత సేనను పంపేసి, మరి కొంత సేనతో రావీ, చీనాబ్ దిగువప్రాంతాల ఉండే జాతులను నాశనం చేస్తూ వెనక్కు మరలాడు. మాలవులతో యుద్ధం చేసేటప్పుడు అతను తీవ్రంగా గాయపడ్డాడుకూడా. తరువాత అతను సింధుదేశంలోని ముఖ్య పట్టణాలను జయించి, క్రీ పూ. 325 లో సముద్ర మార్గాన బాబిలన్ చేరుకుని, మరి రెండు సంవత్సరాల అనంతరం ఆ నగరంలోనే మరణించాడు.

అలెగ్జాండరు జయించిన భారత ప్రాంతాలలో రాజ ప్రతినిధులుగా పర్షియనులూ, మాసిడన్ దేశీయులూ నియోగించబడ్డారు. శశిగుప్త, అంభీ మొదలైన రాజులుకూడా యవన పరిపాలనకు సహాయపడ్డారు. పౌరవ రాజూ, అభిసారదేశపు రాజూలాటివారు కొందరు సామంతులయారు. పుష్కలావతి లోనూ, తక్షశిలలోనూ అలెగ్జాండరు తాలూకు సైనిక కేంద్రాలు ఏర్పాటయాయి.





# పార్వతీకల్యాణము

ద్వితీయాశ్వాసము

దక్షయజ్ఞమునందు తన సతి
దగ్ధమైనది మొదలు ఈశుడు
తపసియై, తగినట్టి తావని
తరలి వచ్చె హిమాద్రి చెంతకు.

ప్రమథులతో పరమశివుడు
హిమగిరి కరుదెంచెనని
వార్తను విని ఎంతో హిమ
వంతుడు సంతోషించెను.

పార్వతితో, భార్యతోడ,
బంధువర్గముల తోడుత
హిమవంతుడు ఎదురుపోయి
ఈశ్వరునకు మ్రొక్కినాడు.

శివుడాతని శిరసుపైన
చేయిపెట్టి దీవించెను,
ఇక పొమ్మని హిమవంతుని
ఈశ్వరు డాజ్ఞాపించెను.

చేతులొగ్గి హిమవంతుడు
శివుని నిట్లు వేడుకొనెను :
"మునులు నిన్ను వినియుందురు;
కనియుండరు నీ రూపము!

ఇట్టి నిన్ను చూచియు మఱి
ఇంటి కెట్లు చనువాడను ?
పెన్నిధి గని చనగలేని
పేదవాడనైనాడను !

ఈ బాలిక నా కూతురు;
ఇది చిన్నప్పటినుండియు
నిన్ను గొలిచి ఎల్లప్పుడు
నీ నామము జపియించును.

ఈ పట్టున నీ వుండుట
మా పుణ్యం బనుకొందుము!
ఈ కన్నియసేవ నీవు
ఇచ్చగింతువని యెంతుము."

ఉత్పల సత్యనారాయణాచార్య



అని పలికిన శివుడేమియు
అనక ఊరకుండినాడు ;
అది మహాప్రసాద మనుచు
అద్రిరాజు తలచినాడు.
శివుని పను లనురక్తి తోడుత
చేయుమని హిమవంతు డామెకు
చెప్పి వెళ్లెను—అంత పార్వతి
సిగ్గుతో శివువైపు మళ్లెను.
నెమిలి యీకలతోడ పార్వతి
నేల నెమ్మది చిమ్ము చుండును,
మెల్లమెల్లగ మంచిగందపు
నీళ్లతో కలయంపి చల్లును.

ముత్యములతో రకరకాలుగ
ముగ్గులను వాకిటను దీర్చును,
గంగజల మెయ్యారముగ బం
గారు బిందెల నించి తెచ్చును.

పూలు పండ్లును తెచ్చి ఈశ్వరు
మ్రోలనిడి తా మ్రొక్కుచుండును,
శివుని తలపై చంద్రకళ యా
చెలియ శ్రమ పోగొట్టుచుండును!

పొన్నపూలు తలకు జుట్టి,
బుజపత్తిరి తోళ్ళు గట్టి,
భస్మమలది, బండరాళ్ళ
ప్రమథులు కూర్చొనియుందురు.

కాలి గిట్టలతోడ బసవడు
కరుడు గట్టిన మంచు త్రవ్వచు,
గవయు మృగముల జూచి అంకెలు
గర్జనలు గావించుచుండును.

అగ్ని ముందఱ శివుడు కూర్చొని
ఆత్మలో జపియించుచుండును;
చెంతనే కూర్చుండి పార్వతి
శివుని మఱిమఱి చూచుచుండును.

అట్టి కాలమునందు తారకు
డనెడి రాక్షసు డేపు మీఱెను;
వాని మద మడపంగజాలెడు
వా డెవండును లేకపోయెను.

దేవపతి నోడించి యాతని
తెల్లగుఱ్ఱము పట్టితెచ్చెను;
అతడె ఇంద్రుని యాగభాగము
అనుభవించుచు పొతరించెను.

అమరపతి యైరావతమునకు
యముని దున్నకు పోటి పెట్టును,
సురవధూటులు తనకు వింజా
మరలువీవగ చూచుచుండును.

అచ్చరలతో అతని భటులె య
థేచ్ఛముగ విహరించుచుందురు,
సిద్ధ సాధ్యుల యక్షగుహ్యుల
సేవలను గైకొనుచునుందురు.

తారకు నోడింపలేక,
తనవారలతో ఇంద్రుడు
బ్రహ్మలోకమున కేగెను,
ప్రస్తుతులను గావించెను.

సుప్తములగు పద్మాలకు
సూర్యోదయ మైనట్టులు
భయము గొన్న దేవతలకు
బ్రహ్మదేవు డగుపించెను.

పలువిధముల నింద్రాదులు
బ్రహ్మను స్తుతియించినారు;
మీ రాకకు కతమేమని
మెచ్చి బ్రహ్మ అడిగినాడు.



దేవగురువు బ్రహ్మకిట్లు
దీనముగా విన్నవించె—
"దేవా! అంతర్యామివి
నీ వెఱుగనిదేమున్నది?

తమ వరముల బలిమిచేత
తారకుడను రాక్షసుండు
లోకనాశనమున కైన
తోకచుక్క లాగుండెను!

అమరవరుల పాఱద్రోలి,
అచ్చరలకు ముచ్చటపడి,
కింపురుషుల చంపివైచి,
కిన్నరులను నఱకివైచి—

విద్యాధర గంధర్వులు
విశ్వే దేవతలందఱు
తన కూడిగ మొనరింపగ
తారకు డేలిక యయ్యెను.

వాని కంట బడిన మునులు
ప్రాణముతో బయట పడరు;
వానిచేత నాశనమ్ము
కాని యజ్ఞ మొకటి లేదు!

తనను గెలువలేక శివుడు
వనముల పాలయ్యెననుచు,
విష్ణు వసల్లు లేడటంచు
విఱ్ఱవీగుచుండె నతడు.

వాని గెల్చునట్టి వీర
సేనాపతి మాకు నిమ్ము"
అని యడిగిన బ్రహ్మదేవు
డాలోచన చేసి పలికె.

"అమరులార! మీ కోరిక
సమకూరెడు నికమీదట;
తారకు నేనిపుడు చంప
ధర్మము కా దిది వినుండు.

శివు డిప్పుడు హిమగిరిపై
చేరి తపము చేయుచుండె;
పార్వతి యాతని ప్రక్కన
పరిచర్యలు జరుపుచుండె.

వా రిద్దఱికిని పుట్టిన
వా డాతని చంపగలడు;
కావున ఈశ్వరుడా మెను
కైకొను నట్లొనరింపుడు."

అని యానతి యొసగి బ్రహ్మ
అంతర్ధానము చెందెను;
ప్రమదముతో ఇంద్రాదులు
అమరావతి కరుదెంచిరి. —(సశేషం)






## 8

[కాలభైరవుడి విగ్రహం ముందు, బ్రహ్మదండి మాంత్రికుడు చేసిన హోమం వల్ల పొగ లేచి, గుహనంతా చుట్టి వేసింది. ఆ విధంగా వాడున్న చోటు రాజు పంపిన సైనికులకు తెలిసిపోయింది. మంత్రశాస్త్రం తెలిసిన రాజగురువు స్వయంగా వచ్చి, కాలభైరవుడి నోరు కట్టేశాడు. మాంత్రికుడు కేశవుణ్ణీ, జయమల్లునూ ఎక్కినా పారి పొమ్మన్నాడు. తరవాత—]

కొండ ఎక్కుతున్న బ్రహ్మపుర సైనికుల్లో ఒకడు, కేశవుడూ, జయమల్లూ గుహ నుంచి బయటికి రావటం చూశాడు. వాడు రాజగురువుతో, "అయ్యా, గుహలో వున్నది ఒకడు కాదు, ఇద్దరు మాంత్రికులు, అదిగో చూడండి!" అంటూ గుహ కేసి చేయి చూపాడు.

సైనికుడలా చెప్పగానే రాజగురువుతో పాటు, కేశవుడి ముసలితండ్రి కూడా అటు కేసి చూశాడు. అతడికి ప్రాణం లేచివచ్చినట్టయింది. తన కొడుకు బతికే వున్నాడు! తను భయపడ్డట్టు, మాంత్రికుడు అతడికేమీ హాని చెయ్యలేదు.

రాజగురువు, పారిపోతున్న కేశవుణ్ణీ, జయమల్లునూ చూస్తూనే, "వాళ్లు మాంత్రికులు కాదు, వాడి శిష్యులై వుంటారు. మాంత్రికుడు ఈ సరికే గుహ నుంచి మరో మార్గాన పారిపోయివుంటాడు. లేదా, అక్కడే వాడికి దాక్కునేందుకేదైనా రహస్య ప్రదేశం వుండివుంటుంది. వాడి శిష్యుల్ని



కూడా మనం చేజిక్కించుకోవాలి. మీరు అన్ని వైపుల నుంచీ చుట్టు ముట్టండి," అని సైనికుల నాజ్ఞాపించాడు.

గుంపుగా నడుస్తున్న సైనికులందరూ, రాజగురువు ఆజ్ఞ వింటూనే జట్లు జట్లుగా చీలిపోయి, వలయాకారంగా కొండ మీదికి ఎక్కసాగారు. పారిపోతున్న కేశవుడూ, జయమల్లూ వాళ్ళను చూసి, ఎటు పారి పోవాలో తెలియక తికమకపడ్డారు.

"సైనికులు అన్ని వైపుల నుంచీ మనను చుట్టుముట్టి పట్టుకోవాలని చూస్తున్నారు. వాళ్ల కంట బడకుండా పారిపోవటం ఎలా?" అన్నాడు కేశవుడు.



"నేనూ అదే ఆలోచిస్తున్నాను," అంటూ జయమల్లు ఓ క్షణం ఆగి, "మనం ఒకటి చేద్దాం. ఈ సైనికులు వెన్నంటి వుండగా, కొండ దిగి అడవిలోకి పోగల గటం సాధ్యమయేది కాదు. మనం యిక్కడే ఏదైనా చీకటి గుహలో జొరబడి దాక్కుందాం," అన్నాడు.

"మనను పట్టటానికి బయిలుదేరిన వాళ్ళు, ఈ చుట్టుపక్కల వున్న గుహలూ, గుట్టలూ, పుట్టలూ వెతక్కుండా వూరు కుంటారా? ఏమైతేనేం మనం, మాంత్రికుడి గుహలో నుంచి బయటికి రావటం బ్రహ్మ పుర సైనికులు చూడటంతో, చిక్కులో పడ్డాం," అన్నాడు కేశవుడు.

"నువ్వంత నిస్పృహ పడకు, కేశవా. మనం రాజభటులకు దొరక్కుండా దాక్కు నేందుకు శాయశక్తులా ప్రయత్నిద్దాం. ఒక వేళ దొరికామో, ప్రాణాపాయం రాకుండా బయటపడే మార్గం నేను ఆలోచించే వున్నాను," అన్నాడు జయమల్లు.

జయమల్లేదో పెద్ద ఎత్తుగడ ఒకటి ముందే ఆలోచించి వుంచాడని కేశవుడు అర్థం చేసుకున్నాడు. అయితే, అదేమిటో అడుగుదామని కేశవుడు అనుకునే లోపలే, జయమల్లు పక్కన వున్న ఒక సొరంగ



మార్గంలోకి ఎగిరి దూకుతూ, "కేశవా, చీకటని భయపడకు. నా వెనగ్గా రా. ఈ సొరంగ మార్గం, నాకు బాగా తెలిసిందే," అని కేక వేశాడు.

కేశవుడు మరి చేసేదేమీ లేక జయమల్లు వెనక సొరంగంలోకి దూకాడు. లోపల చీకటిగా వున్నది. జయమల్లు రెండు చేతులనూ, పక్కలకు బారచాచి, సొరంగపు టంచులను తాకుతూ, జాగ్రత్త అని కేశవుడికి హెచ్చరికలిస్తూ త్వరత్వరగా ముందుకు నడవ సాగాడు.

రాజగురువు ఆజ్ఞ విని, మాంత్రికుడున్న గుహనూ, ఆ పరిసర ప్రాంతాలనూ చుట్టుముట్టడానికి బయలుదేరిన సైనికులకు, కేశవుడూ, జయమల్లూ కనిపించలేదు. వాళ్ళల్లో నలుగురు ప్రతి గుహలోకీ తొంగి చూస్తూ, చివరికి బ్రహ్మదండి మాంత్రికుడి గుహ దగ్గిరకు వచ్చి, లోపలకు చూస్తూనే, కాలభైరవుడి విగ్రహాన్ని చూసి, మూర్ఛపోయినంత పని చేశారు.

"ఉగ్రరూపం, భయంకరాకారం, కాళ్ల కింద నేల గిర్రున తిరిగిపోతున్నది!" అంటూ యిద్దరు సైనికులు గుహ ముందు వెల్లకిలా పడిపోయారు. సైనికుల అరుపులు విన్న రాజగురువూ, సేనానాయకుడూ అక్కడికి




పరిగెత్తుకు వచ్చారు. గుహముందు యిద్దరు సైనికులు మూర్ఛపడి వున్నారు, మరిద్దరు గుహకు ఆనుకుని నిలబడి, గట్టిగా కళ్ళు మూసుకుని, ఏదో దండకం వినబడీ వినబడనట్టు గొణుగుతున్నారు.

సైనికుల వాలకం చూస్తూనే, సేనానాయకుడికి మండిపోయింది. అతడు కింద పడి వున్న సైనికులను కాలితో గట్టిగా తన్నుతూ, "చచ్చారా, బతికున్నారా?" అంటూ పళ్ళు కొరికాడు.

సేనానాయకుడి తాపులకు కింద పడి వున్న సైనికులిద్దరూ ఎగిరి లేచి నిలబడ్డారు. దండకం పఠిస్తున్న వాళ్ళు చప్పున కళ్ళు



తెరిచారు. తరవాత నలుగురు సైనికులూ ఏకకంఠంగా, "గుహలో వున్న భయంకర స్వరూపాన్ని చూస్తూనే, మాకు శరీరాలు స్వాధీనం తప్పినై, సేనానీ," అన్నారు.

"అహా, ఎంతటి సాహస విక్రమార్కులోయ్, మన బ్రహ్మపుర సైనికులు!" అంటూ రాజగురువు గుహలోకి ప్రవేశించాడు. గుహలో అంతా నిశ్శబ్దంగా వున్నది. కాలభైరవుడి విగ్రహం ముందు మాంత్రికుడు వెలిగించిన మంటలు యింకా చల్లారలేదు. వాడు వేసిన ధూపం తాలూకు పొగ, యింకా గుహలో అక్కడక్కడా తారట్లాడుతున్నది.



"సేనానీ!" అని కేకవేశాడు రాజగురువు, చుట్టూరా కలయచూస్తూ. సేనానాయకుడు గుహలోకి వచ్చాడు.

"ఈ గుహలో నుంచి ఎక్కడికో రహస్య మార్గం వుండి వుంటుంది. మాంత్రికుడు దానివెంట పారిపోయి వుంటాడని నా అనుమానం. వాడి అనుచరు లిద్దరూ గుహలోంచి బయటికి పారిపోవటం మనం చూశాం. వాళ్ళను రాజుగారి అంగరక్షకుడు వెతికి పట్టుకుంటాడు. మనం, ఈ మాంత్రికుణ్ణి కలుగులోంచి బయటికి లాగాలి," అన్నాడు రాజగురువు.

సేనానాయకుడు గుహకు అన్ని వైపులా పరీక్షగా చూశాడు. అతడి కెక్కడా ద్వారం వున్న గుర్తు కనిపించలేదు. "గుహలోకి మనం ప్రవేసించిన దారి తప్ప, పారిపోయేందుకు మరే మార్గం వున్నట్టు కనిపించటం లేదు, గురువర్యా," అన్నాడతడు.

"చూడగానే కనిపించేదైతే, అది రహస్య మార్గం ఎలా అవుతుంది? గుహలో ప్రతి అంగుళాన్ని నొక్కుతూ కదిలించి చూడండి. ఏదైనా రహస్య ద్వారం వుంటే తెరుచుకుంటుంది," అన్నాడు రాజగురువు.

సేనానీ, నలుగురు సైనికులూ గుహనంతా చేతులతో, కత్తిపిడులతో, నొక్కి



చూశారు. ఎక్కడా రహస్య ద్వారం వున్న సూచనలైనా కనిపించలేదు. ఈ లోపల రాజగురువు కాలభైరవుడి విగ్రహాన్ని పరీక్షగా చూడసాగాడు. హఠాత్తుగా ఆయనకో అనుమానం కలిగింది. సేనానాయకుడు వచ్చి గుహలో ఎక్కడా రహస్య ద్వారం లేదని చెప్పగానే, రాజగురువు, కాలభైరవుడి విగ్రహాన్ని అతడికి చూపుతూ, "బహుశా. ఈ విగ్రహం అడుగున ఏదైనా రహస్య బిలం వున్నదేమో. లేకపోతే మాంత్రికుడు ఎట్లా మాయమయినట్టు? విగ్రహాన్ని కదిలించి చూడండి," అన్నాడు.



సైనికులూ, సేనానాయకుడూ కాలభైరవుడి విగ్రహాన్ని పైకెత్తేందుకు ప్రయత్నించారు. అది కదలలేదు. అటూ యిటూ పక్కలకు లాగేందుకు యత్నించారు. కాని, అది వున్న చోటు నుంచి అంగుళమైనా జరగలేదు. రాజగురువు ఈసారి విగ్రహాన్ని తల దగ్గిర నుంచి అతి జాగ్రత్తగా తడివి చూస్తూ, దాని వెన్నుమీద వేళ్ళతో నొక్కుతూ, "ఆహాఁ, ఇదీ రహస్యం! ఇదేదో పోతపోసిన విగ్రహం అనుకున్నాను, కాదు. ఇది అతుకులమారి బొమ్మ. ఎక్కడో ఏదో ఒక భాగాన్ని కదిలిస్తే, ఇది తప్పక రెండుగా విచ్చుకుంటుంది. మాంత్రికుడు దీని పొట్టలో వుండి వుంటాడని నా అనుమానం. బహుశా, వాడు మన సంభాషణ అంతా వింటూండినా వింటుండొచ్చు," అంటూ పెద్దగా నవ్వాడు,

రాజగురువు యిలా అనగానే, సేనానీ, సైనికులూ కాలభైరవుడి విగ్రహాన్ని, తలా, కాళ్ళూ పట్టుకుని గుంజసాగారు. సైనికులకు మాత్రం ఆ విగ్రహం అంటే యింకా భయం పోలేదు. వాళ్ళేదో కాలుతున్న లోహాన్ని తాకి చూస్తున్న వాళ్ళలాగా అటూ యిటూ గెంతుతున్నారు.

ఇదంతా గమనిస్తున్న రాజగురువు, కోపంగా వాళ్ళకేసి చూస్తూ, "ఎందుకంత





భయపడి చస్తున్నారు? మీ ప్రాణాలకేం ప్రమాదం రాదు," అని గట్టిగా కసిరాడు.

సైనికుల కా మాటల్తో ప్రాణభయం పోకపోయినా, ఉద్యోగాలకు ముప్పు వస్తుం దేమోనన్న దడుపు పుట్టింది. రాజగురువు సర్వసమర్థుడు. రాజుగారి దగ్గిర ఆయన మాటకు తిరుగులేదు. ఇలా అనుకుని సైని కులు ఎక్కడ లేని తెగువా తెచ్చుకుని కాలభైరవుడి విగ్రహాన్ని, అటూ యిటూ కుదిలించ సాగారు. వాళ్ళల్లో ఒకడు విగ్రహం తోక పట్టుకుని గుంజే సరికి, ఉరిమినట్టు ఫెళఫెళ మంటూ విగ్రహం రెండుగా చీలి పక్కలకు పడిపోయింది.



రాజగురువు పొందిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. మాంత్రికుడు కాలభైరవుడి పొట్టలోంచి కొండలోకి ఎక్కడికో ఒక రహస్య బిలమార్గం ఏర్పాటు చేసుకున్నా డన్న మాట! ఇప్పుడు వాడు ఆ బిలమార్గం లోంచి బయటికి పారిపోయి వుంటాడు. లేదా, అందులోనే ఎక్కడైనా దాక్కొని అయినా వుంటాడు.

రాజగురువు యిలా ఆలోచించి, సేనా నాయకుడితో, "సేనానీ, మాంత్రికుణ్ణి పట్టుకునే పని ఒక విధంగా సుకరమయిం దనుకుంటాను. మన సైనికులు కొండ గుహలన్నీ గాలిస్తూ వుండగా, వాడు కొండ దిగి పారిపోయేందుకు ప్రయత్నించడు. ఈ బిలం చూశావు గదా? ఇది ఎక్కడికి పోతుందో తెలియదు. కాని, మాంత్రికుడు యిందులోనే ఎక్కడో దాక్కుని వుంటాడు. మనవాళ్ళకు కాగడా లిచ్చి, బిల మంతా వెతికించు," అన్నాడు.

గుహలో మాంత్రికుడు సొంత వుపయో గానికి దాచుకున్న కాగడాలను సైనికులు, అక్కడే వున్న చమురులో తడిపి, వెలి గించి, సేనానాయకుడు ముందుండి దారి తీయగా, కాలభైరవుడి పొట్టలో నుంచి దిగు వకు వున్న బిలంలో దిగారు.







కాలభైరవుడు రెండుగా విరిగి పడినప్పుడు అయిన పెద్ద ధ్వనిని, మచ్చల సింహం గుహలో దాక్కొని వున్న కేశవుడూ, జయమల్లూ విన్నారు. సింహం గుహముందున్న బండరాయి మీద పడుకుని నిద్రమత్తుతో జోగుతున్నది.

"బ్రహ్మదండిగాడి రహస్యం సైనికులకు తెలిసిపోయింది. ఇక వాణ్ణి వాళ్ళు పందికొక్కును కలుగులో నుంచి లాగినట్టు బయటికి లాగుతారు," అన్నాడు జయమల్లు. ఇంతలో వాళ్ళు దాక్కున్న గుహ వెనక భాగాన అడుగుల చప్పుడు వినిపించింది.

"సైనికులకు మనం దాక్కున్న చోటు తెలిసిపోయింది!" అన్నాడు కేశవుడు, ధ్వని వచ్చిన వైపుకు చూస్తూ.

జయమల్లు ఒక్క ఎగురున వెళ్ళి, గుహ వెనక భాగాన నలుచదరంగా వున్న ఒక రాతికి అడ్డంగా, ఇనపకమ్మి నొక దానిని తోసి, అడుగులో అడుగు వేసుకుంటూ కేశవుడి దగ్గిరకు వచ్చి, రహస్యంగా అతడితో, "ఇక మనకు ఆ వైపునుంచి ప్రమాదం రాదు. అక్కడ ఏదో నలుచదరపు రాయి వున్నదని తప్ప, అది గుహలోకి తెరుచుకునే తలుపు అని వాళ్ళు గ్రహించలేరు. ఇంతకీ బ్రహ్మదండిగాడు ఏమయినట్టు? వాళ్ళకు దొరికిపోయాడా?" అన్నాడు అనుమానంగా.

కేశవుడు జవాబు చెప్పబోయేంతలో గుహ వెనుకభాగాన్నుంచి, "శిష్యా, శిష్యా," అన్న సన్నని పిలుపు వినిపించింది. ఆ స్వరం గుర్తు పడుతూనే, జయమల్లు నిలువెల్లా కంపించిపోయాడు. అతడు కేశవుడి చెవిలో రహస్యంగా, "కాలభైరవుడి విగ్రహం అడుగున ఏదో రహస్య బిలం వున్నదని నాకు తెలుసు కాని, అది సరిగా ఈ గుహలోకి వస్తుందని నే నెరగను. బ్రహ్మదండిగాడి రహస్యం సైనికులకు తెలిసిపోగానే, వాడు యిక్కడికి పారిపోయి వస్తున్నాడు. మనం ఆ నలుచదరపు రాయికి అడ్డం తీసి గుహ

లోకి దారి యిచ్చాడేమో, మనం కూడా సైనికులకు చిక్కిపోతాం. అందుకని మనం గుట్టు చప్పుడు కాకుండా వూరుకోవటం మంచిది," అన్నాడు.

ఈలోపల బ్రహ్మదండి మాంత్రికుడు, శిష్యా, శిష్యా, అంటూ చాలా సార్లు కేకలు పెట్టి, గుహ వెనుకభాగాన్ని తన మంత్ర దండంతో కొట్టసాగాడు. కాని, అతడికి యివతలి నుంచి ఎలాంటి జవాబూ రాలేదు. కేశవుడూ, జయమల్లూ కిక్కురుమనకుండా గుహలో ఒక మూలకొదిగి కూర్చున్నారు.

అక్కడ రాజగురువు అజ్ఞ విని బిలం లోకి దిగిన సేనానాయకుడూ, సైనికులూ, మాంత్రికుడు వెళ్ళిన మార్గం కనుక్కోలేక, పక్కదారుల వెంట చాలాసేపు తిరిగి, చీకటి కోణాల్లో నానా అవస్థలూ పడి, కొంత సేపటికి రాజగురువున్న చోటుకు తిరిగి వచ్చారు. "మాంత్రికుడు దొరకలేదా?" అని అడిగాడు రాజగురువు.

"గురువర్యా, వాడా బిలంలో వున్న సూచనలేం కనిపించ లేదు. బిల మార్గం ఎక్కడా సూటిగా లేదు. చేతివేళ్ళలా అందులో అన్ని వైపులకూ సొరంగ మార్గాలున్నై. వాడెక్కడా కనిపించలేదు," అన్నాడు సేనానాయకుడు.

"అలాగా," అంటూ రాజగురువు కొంచెంసేపు ఆలోచించి, "వాడు, ఈ బిలం లోని, ఏ సందుల్లోనో దాగివున్నాడనే దాంట్లో సందేహం లేదు. వాణ్ణి బయటికి రప్పించటానికి ఒకే మార్గం వున్నది. మీరంతా వెళ్లి ఎండుపుల్లలూ, ఆకలములూ పోగుచేసుకు వచ్చి, బిలమార్గాన్ని వాటితో నింపి, నిప్పు పెట్టండి. వాడు ఆ పొగకు తట్టుకోలేక, ఏదో ఒక సొరంగం నుంచి బయటికి వస్తాడు. అప్పుడు పట్టుకోవచ్చు," అన్నాడు

సైనికులు బిలద్వారాన్ని ఎండు పుల్లలతో నింపి, దానిమీద యింత చమురు పోసి, నిప్పంటించారు. —(ఇంకా వుంది)






# ప్రభువంచన

విసుగు చెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీకు ఈ తీరని కష్టం ఏ ఆడదైనా తెచ్చి పెట్టిందా అని సందేహంగా ఉన్నది. ఎందు కంటే, సాధారణంగా ఎంతో ప్రయోజకులు సయితం స్త్రీల మూలంగా చిక్కులలో బడి అష్టకష్టాలకూ గురి అవుతారు. ఇందుకు రూపబాణుడే నిదర్శనం. నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు అతడి కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

పూర్వం కపిలదేశపు రాజుకు మల్లిక అని ఒక కుమార్తె ఉండేది. ఆమెకు యుక్త వయసు రాగానే అనేక దేశాల రాజులు ఆమెను తమ కిచ్చి వివాహం చేయవలసిం దని కోరుతూ దూతలను పంపారు. తన

## బేతాళ కథలు



కుమార్తెకు ఇష్టంలేని పెళ్ళి ఛెయ్యటం కపిలరాజుకు సమ్మతం కాదు. అందుచేత ఆయన ప్రతిసారీ తన కుమార్తెను, "ఈ సంబంధం నీ కిష్టమేనా, అమ్మా?" అని అడుగుతూ వచ్చాడు.

మల్లిక ఆ వచ్చిన వివాహ సంబంధా లన్నిటినీ నిరాకరించింది.

ఇలా వుండగా పద్మదేశపు రాజైన వీర సింహుడి పట్టపు రాణి చనిపోయింది. ఆయన తన మంత్రులను పిలిచి, "నేను మళ్ళీ పెళ్ళాడతాను. నాకు తగిన కన్య ఎక్కడ ఉన్నదీ విచారించండి," అన్నాడు. మంత్రులు తడుపుకోకుండా కపిలరాజు కూతురు మల్లిక పేరు చెప్పారు. వీర సింహుడు తన దూతలను కపిలరాజు వద్దకు పంపాడు.

తన కోసం వీరసింహుడు దూతలను పంపాడని తెలియగానే కపిలరాజు ఆ నాటికి సభ చాలించి, దూతలను సగౌరవంగా తన మందిరానికి తీసుకుపోయి వారు వచ్చిన పని తెలుసుకున్నాడు.

వీరసింహుడు తన కుమార్తెను పెళ్లాడ తాననటం కపిలరాజుకు ఆనందమూ, విచా రమూకూడా కలిగించింది. వీరసింహుడు అమిత బలవంతుడు. ఆయన తలుచు కున్నట్టయితే కపిల రాజ్యాన్ని క్షణంలో జయించగలడు. రెండు దేశాల మధ్యా ఇంతవరకూ ఉంటున్న మంచి సంబం ధాలు ఈ వివాహం జరిగితే మరింత దృఢ పడతాయని కపిలరాజు ఆనందించాడు. మరి విచారం దేనికంటే, మల్లిక లోగడ ఎందరో యువకులైన రాజకుమారులను నిరాకరించి ఉన్నది, వయసు మళ్ళిన వీర సింహుణ్ణి పెళ్ళాడటానికి ఆమె సమ్మ తిస్తుందో, లేదో!

ఆయన తన కుమార్తె వద్దకు వెళ్ళి, "అమ్మా, పద్మదేశ మహారాజైన వీర సింహుడు దూతలను పంపి, నిన్ను పెళ్ళా

డతానని కబురు చేశాడు. నీ అభిప్రాయం ఏమిటి ?" అని అడిగాడు.

వీరసింహుడి కోరికను నిరాకరించే గుండె ధైర్యం తన తండ్రికి లేదని తెలుసుకుని మల్లిక, "నీకు అల్లుడుగా పనికివచ్చే వాడు, నాకు భర్తగా పనికిరాకపోతాడా ?" అన్నది. ఈ మాటను ఆమోదంగా భావించి సంతోషపడి కపిలరాజు దూతలతో, "రెండు వారాల అనంతరం మంచి ముహూర్త మున్నది. వీరసింహ మహారాజుగారు సపరివారంగా ఆ ముహూర్తం నాటికి తరలి రావచ్చు," అన్నాడు.

ముహూర్తానికి ఒక రోజు ముందుగా వీరసింహుడు తన కొడుకులతోనూ, తన అంగరక్షకులైన యోధులతోనూ, పెద్ద సేన తోనూ అట్టహాసంగా బయలుదేరి కపిల నగరానికి వచ్చి చేరాడు.

అతని అంగరక్షకులందరూ అద్భుత వీర్య పరాక్రమాలు గలవారు. వారిలో రూప బాణుడనేవాడు అందంలో నవమన్మథుడు.

కపిలరాజు వీరసింహుడి గౌరవార్థం గొప్ప విందు చేశాడు. ఆ విందుకు వీర సింహుడి వెంట అతని అంగరక్షకులూ, కుమారులూ, ముఖ్యోద్యోగులూ హాజరై ఒక పంక్తిలో కూచున్నారు.



మల్లిక ఒక కిటికీ వద్ద నిలబడి వీర సింహుడి పరివారాన్ని చూస్తూ, తన చెంత నిలబడిన చెలికత్తెతో, "ఏమే, ఈ విందు ఎందుకు జరుగుతున్నదీ ? అసలీ రాజుగారు మన దేశానికెందుకు వచ్చినట్టూ ?" అని అడిగింది.

"మీకు తెలియకపోతే నాకు తెలుస్తుందా, అమ్మా ?" అన్నది చెలికత్తె. కాని రాజకుమార్తె మళ్ళీ అదే ప్రశ్న అడిగేసరికి, "ఆ మహారాజు తమర్ని పెళ్ళాడటానికి వచ్చారని మీకు తెలియదా ?" అన్నది.

"పెళ్ళి మాట చూచాయగా విన్నాను గాని ఈయనే నన్ను పెళ్ళాడుతున్నాడని

తెలియదే. మా తండ్రి కన్న పెద్దవాడు; తన కొడుకుకో, మనవడికో నన్ను చేసుకుంటానంటే భావ్యంగా ఉండేది గాని, తానే చేసుకోవట మేమిటి?" అన్నది మల్లిక వెటకారంగా.

ఆమె ఆ రాత్రి వీరసింహుడి విడిదికి మత్తుమందు కలిపిన పానీయాలు పంపి, వాటిని రాజుగారి అంగరక్షకులకు తప్ప మిగిలిన వారందరికీ ఇచ్చేటట్టు ఏర్పాటు చేసింది. ఆ పానీయాలు తాగి వీరసింహుడూ, అతని కొడుకులూ, మంత్రులూ స్పృహ లేకుండా పడిపోయారు. తరవాత ఒక చెలికత్తె రూపబాణుడి వద్దకు వచ్చి, "మా రాజకుమార్తెగారు రమ్మంటున్నారు," అని చెప్పింది.

రూపబాణుడు ఆశ్చర్యపడ్డాడు. అయినా దాసినేమీ ప్రశ్నించకుండా, దాని వెంట బయలుదేరి రాజకుమార్తె ఉండే చోటికి వచ్చి, "ఏమి సెలవు?" అని అడిగాడు.

"రేపు నాకు పెద్ద ఆపద రాబోతున్నది. నన్ను మీ రాజు పెళ్ళాడేస్తాడు. ఆ పెళ్ళి నా కిష్టం లేదు. ఈ ఆపద నుంచి నన్ను నీవే కాపాడాలి. నీవు చాలా బలశాలివనీ, ధైర్యశాలివనీ విన్నాను. నన్ను నీవు కాపాడితివా, నేను మనస్ఫూర్తిగా నీ భార్యనవుతాను," అన్నది మల్లిక.



"మా మహారాజు ఉప్పు తింటున్నాను. నేను మీకు ఎలా సహాయం చేయను?" అన్నాడు రూపబాణుడు.

"ఆపదలో ఉన్న అబలలను ఆదుకోవాలని నీకు దీక్షలేదా? నిన్ను రాజ ద్రోహం చెయ్యమనటం లేదు. నన్ను రక్షించమంటున్నాను," అన్నది మల్లిక.

"రక్షిస్తాను. అందుకేం చెయ్యాలి?" అని రూపబాణుడు అడిగాడు.

"ఈ రాత్రే మనం ఎలాగైనా పారిపోవాలి," అన్నది మల్లిక.

"ఆ పని చేస్తే నేను మా మహారాజుకు బద్ధ విరోధినయితీరుతాను. అదీగాక అందువల్ల నీకు కలగబోయే మేలుకూడా ఉండదు. ఎందుకంటే, వీరసింహ మహారాజు శక్తి నాకు తెలుసు. మనం ఎక్కడికి పోయినా ఆయన మనని వెన్నంటి రాగలడు. మనని ఘోరంగా శిక్షించగలడు. ఆయన భార్యవు కాకుండా మానగలవేమో గాని, నా భార్యవు కావటం నీకు అసాధ్యం," అని స్పష్టంగా చెప్పాడు రూపబాణుడు.

"నాకు సహాయం చెయ్యటం ఇష్టం లేకనే, ప్రాణ భయంచేతనో ఈ మాటలంటున్నావు," అన్నది మల్లిక.

"నీకు నిజం తెలియటం మంచిదని చెప్పాను. వెళ్ళిపోదాం పద. నేను సిద్ధంగా





ఉన్నాను," అన్నాడు రూపబాణుడు. మల్లిక పరమానందం చెంది భవనం విడిచి అతని వెంట బయలుదేరింది.

రూపబాణుడు చెప్పిన మాటలలో అతిశయోక్తి ఆవగింజంత కూడా లేదు. మర్నాడు తెల్లవారగానే మల్లికా రూపబాణులు కలిసి పారిపోయారని తెలిసి, వీరసింహ మహారాజు ఉగ్రుడైపోయి, తన సేనతో సహా వాళ్ళను పట్టుకోవటానికి బయలుదేరాడు. ఇందువల్ల మల్లికా రూపబాణులు వంట చేసుకున్న చోట భోజనం చెయ్యకుండా, భోజనం చేసినచోట విశ్రమించకుండా, రాత్రిళ్ళు అతి రహస్యస్థలాలలో నిద్రిస్తూ ముందుకు ప్రయాణం సాగించవలసి వచ్చింది.

వేటగాడికి అందకుండా పరిగెత్తే మృగాలలాగా వారిద్దరూ చాలా రోజులు ప్రయాణించి చివరకు ఒక రాక్షసుడుండే వనం చేరారు. ఆ రాక్షసుడు ఎవరిచేతా చావకుండా వరం పొందినవాడు. వాడి ప్రాణాలు తీయగలది వాడి గద మాత్రమే. ఆ గద ఎల్లప్పుడూ, వాడు నిద్రపోయేటప్పుడు కూడా, వాడి చేతిలోనే ఉండేది. దానితో ఒక్క పెట్టుపెడితే ఎంతటి వాడైనా చచ్చి తీరవలిసిందే. అందుచేత ఆ రాక్షసుడి వనంలోకి ఎవరూ అడుగు పెట్టేవారు కారు.

మహాబలుడైన వీరసింహుడు కూడా ఆ ప్రాంతాలకు వేటకువస్తే ఆ వనం చాయలకు వచ్చేవాడుకాడు.

అందుచేత రూపబాణుడికి అది క్షేమమైన ప్రదేశం. అతను మల్లికను వెంటబెట్టుకుని రాక్షసుడి వద్దకు వెళ్ళి, అతని శరణువేడి, తననూ మల్లికనూ ఆ వనంలో ఒక పర్ణశాల వేసుకుని ఉంటూ ఉండ నిమ్మన్నాడు.

రాక్షసుడు అందుకు సమ్మతించాడు, కాని ఒక్క నియమం పెట్టాడు. అదేమిటంటే—రాక్షసుడి వనం మధ్య ఒక



మహిమగల మంత్రాల నేరేడు చెట్టున్నది. దాని పళ్ళు తింటే ఆకలీ, దప్పీ, ముసలి తనమూ రావని చెప్పుకునేవారు. ఆ మంత్రాల నేరేడు చెట్టులో ఏవేవో అపూర్వ శక్తు లుండేవి. రూపబాణుడు తన వనంలో ఉంటూ, ఎట్టి పరిస్థితుల్లోనూ ఆ నేరేడు చెట్టు చాయలకు రాకూడదనీ, దాని పండు ఒక్కటికూడా అంటరాదనీ రాక్షసుడు నియమం పెట్టాడు.

"నేను నీ నేరేడు చెట్టుకేసి చూడనైనా చూడను. నన్నూ, నా భార్యనూ నీ వనంలో బతకనిస్తే చాలు," అన్నాడు రూపబాణుడు. రాక్షసుడి అనుమతితో అతను కొన్ని చెట్లు కొట్టి పర్ణశాల నిర్మించాడు. అందులో అతనూ, రాజకుమార్తె మల్లికా నివాసం ఏర్పాటు చేసుకున్నారు. వారికి కావలిసినది సమస్తమూ ఆ వనంలోనే దొరకటం చేత వారు అది దాటి వెళ్ళనవసరం లేదు. రాక్షసుడు వాళ్ళ జోలికి వచ్చేవాడు కాడు. నేరేడు చెట్టు సమీపంలోనే అతను తన ఇంట్లో ఉండేవాడు.

వీరసింహుడు తన పరివారంతో సహా రూపబాణుణ్ణి తరుముకుంటూ రాక్షసుడి వనందాకా వచ్చి తన ఆట కట్టయిందని తెలుసుకున్నాడు. వనానికి కొంత దూరాన ఆయన డేరాలు దించాడు. తరవాత తన అంగరక్షకులైన యోధులను అందరినీ తన చుట్టూ కూచో బెట్టుకుని, "నేనై మీలో ఎవరినీ రాక్షసవనంలోకి వెళ్ళమని అజ్ఞాపించను. కాని ఎవరైనా సాహసించి రాక్షస వనం ప్రవేశించి రూపబాణుడి తల తెచ్చినా సరే, లేక మంత్రాల నేరేడు చెట్టు పళ్ళు గుప్పెడు తెచ్చినా సరే జాగీరు బహుమతిగా ఇస్తాను," అన్నాడు.

ఈ మాట వినగానే ఇద్దరు యోధులు లేచి నిలబడ్డారు. నేరేడుపళ్ళు తేవాలన్న కోరిక వారికి లేదు, ఎందుకంటే ఆ నేరేడు చెట్టును సమీపిస్తే రాక్షసుడి చేత చావు

తప్పదు. కాని ఒకరిద్దరుగా వనం ప్రవేశిస్తే రాక్షసుడు అగ్రహించక పోవచ్చు. రూప బాణుడు ఆ వనంలోకి అదివరకే ప్రవేశించాడు గద. అందుచేత ఈ యోధులు వనం ప్రవేశించి రూపబాణుడి తల తెద్దామని ఆశపడ్డారు.

కాని వారి ఆశ ఫలించలేదు. రూపబాణుడు మల్లయుద్ధంలో ఇద్దరినీ పడగొట్టి బంధించాడు. వారు రూపబాణుణ్ణి క్షమాపణ వేడి, "నీ తల గాని, గుప్పెడు మంత్రాల నేరేడుపళ్ళు గాని తెస్తే మహారాజు మాకు జాగీర్లు ఇస్తామన్నాడు. దానికి ఆశపడి వచ్చాం," అని చెప్పారు.

ఈ సంభాషణ వింటున్న మల్లిక, "మంత్రాల నేరేడు పళ్ళ విశేషమేమిటి?" అని అడిగింది.

రాక్షసుడి ఇంటి పక్కన ఉన్న చెట్టు గురించీ, దాని పళ్ళను గురించీ అందరూ అనుకునే మాటలు రూపబాణుడు మల్లికతో చెప్పాడు. అంతా విని ఆమె, "నాకా పళ్ళు కావాలి," అన్నది.

"రాక్షసుడు నన్ను చంపేస్తాడు," అన్నాడు రూపబాణుడు.

"ఎందుకు చంపుతాడు? ఆ రాక్షసుడు నువ్వడిగితే తప్పక ఇస్తాడు. మనని తన వనంలో ఉండనిచ్చాడు కాదా? ఆ పళ్ళు



తినేదాకా నేను అన్నం ముట్టను!" అని మల్లిక మంకుపట్టు పట్టింది.

చేసేది లేక రూపబాణుడు రాక్షసుడుండే చోటికి వెళ్ళాడు.

"ఏం ఇలా వచ్చావు?" అని రాక్షసుడు అడిగాడు.

"అన్నా, నా భార్య నన్ను చంపుకు తింటున్నది. నీ నేరేడు చెట్టు పళ్ళు ఒక గుప్పెడు కోసుకోనియ్యి!" అన్నాడు రూపబాణుడు.

ఈ మాటలు వింటూనే రాక్షసుడికి శివం ఎత్తింది. "దుర్మార్గుడా, చావు!" అంటూ గద ఎత్తి వాడు రూపబాణుడి పైకి వచ్చి ఆ గదతో అతని మీద బలంగా కొట్టాడు. రూపబాణుడు చాకచక్యంతో పక్కకు తప్పుకునే సరికి గద భూమిలో కూరుకు పోయింది. రూపబాణుడు రాక్షసుడి చేతి పైన తన కాలితో బలంగా తన్ని, దాన్ని తన చేతిలోకి తీసుకుని, ఆ గద ఎత్తి రాక్షసుణ్ణి ఒక్క వేటు వేసేసరికి రాక్షసుడు కాస్తా చచ్చాడు. రూపబాణుడు నేరేడు చెట్టు ఎక్కి తనకు కావలిసినన్ని పళ్ళు కోసుకుని తన పర్ణశాలకు తిరిగి వచ్చాడు.

మల్లిక అప్యాయంగా నేరేడు పళ్ళు కొన్ని తిన్నది. "నీకు రాక్షసుడు పళ్ళు తప్పక ఇస్తాడని నేను చెప్పలేదా?" అన్న





దామె. రూపబాణుడు రాక్షసుడు చచ్చిన సంగతి ఆమెకు చెప్పలేదు.

అతనికి బందీలుగా దొరికిన ఇద్దరు యోధులూ, "మమ్మల్ని విడిచిపెట్టి, చెరొక గుప్పెడూ పళ్ళిస్తివా మేము మహారాజు వద్దకు వెళ్ళి చెరొక జాగీరూ తెచ్చుకుంటాము," అని బతిమాలారు.

రూపబాణుడు వారి కట్లు విప్పి, చెరొక గుప్పెడూ మంత్రాల నేరేడు పళ్ళిచ్చి పంపేశాడు.

వాటిని రుచి చూడగానే వీరసింహుడు అవి నిజంగా మంత్రాల నేరేడు పళ్ళేననీ, రాక్షసుడు చావటంచేతనే అవి తన యోధులకు లభించాయనీ తెలుసుకున్నాడు. ఆయన చివాలున లేచి, "మనం రాక్షసుడి వనం చేరి రూపబాణుణ్ణి పట్టుకోబోతున్నాం, పదండి," అన్నాడు. అందరూ ఆయన వెంట బయలుదేరారు.

తమ కోసం రాజు రాక్షసుడి వనానికి వస్తున్న సంగతి తెలియగానే రూపబాణుడు మల్లికతో మంత్రాల నేరేడు చెట్టెక్కి, ఎత్తయిన దాని కొమ్మలలో ఆకు గుబుర్ల మాటున కనపడకుండా దాక్కున్నాడు.

రాజుగారి పరివారం వనమంతా ఘాలించినా రూపబాణుడి జాడ కనిపించ లేదు. రూపబాణుడూ, మల్లికా దాగి ఉండదగిన చెట్టు మంత్రాల నేరేడు చెట్టు ఒకటే ఉన్నది. అందుచేత రాజు ఆ చెట్టు కింద తన అనుచరులతో సహా కూచుని చదరంగం ఆడసాగాడు. చెట్టుపైన కొమ్మల సందు నుంచి శ్రద్ధగా ఆట చూస్తున్న రూపబాణుడు ఆటమధ్యలో అవతలివాడి చదరంగపు కాయలలో ఒకదాని మీద గురిగా నేరేడు పండు పడవేశాడు. వాడు దానితో రాజుకు షహ పెట్టేటప్పటికి రాజుగారి ఆట కట్టింది.

ఇలా వరసగా రాజుగారి ఆటను రూపబాణుడు మూడుసార్లు కట్టించేసరికి, రూప

బాణుడూ, మల్లికా చెట్టుపైన ఉన్నట్టు రాజుకు రూఢి అయింది. ఆయన ఒక యువకుడితో, "నీవు వెంటనే చెట్టెక్కి పైన ఉన్న రూపబాణుణ్ణి కింద పడెయ్యి," అని ఆజ్ఞాపించాడు.

ఆ యువకుడు చెట్టెక్కాడు. రూపబాణుడు వాణ్ణి తనకు అందుబాటులోకి రానిచ్చి, గుండెల్లో బలంగా ఒక్క తన్ను తన్నేసరికి వాడు పట్టు తప్పి కింద పడ్డాడు. చిత్రమేమిటంటే ఆ కింద పడ్డవాడు చెట్టుయొక్క మహిమవల్ల రాజుకు ముమ్మూర్తులా రూపబాణుడిలాగే కనపడ్డాడు. రాజు తక్షణమే తన కత్తితో వాడి తల తెగవేశాడు. తల తెగి పడ్డాక చూస్తే వాడు తన మనిషేనని తెలిసి రాజు చాలా నొచ్చుకున్నాడు. ఆయన మరొక యువకుణ్ణి పిలిచి వాణ్ణికూడా చెట్టెక్కమని ఆజ్ఞాపించాడు. వాణ్ణికూడా రూపబాణుడు తన్ని కింద పడేశాడు. వాడుకూడా రాజు కళ్ళకు రూపబాణుడిలాగే కనపడి, రాజు కత్తికి బలి అయాడు.

ఎప్పుడైతే రాజు తమలో ఇద్దరిని అకారణంగానూ, అక్రమంగానూ చంపేశాడో, మిగిలిన యోధులు రాజుగారికి ఎదురు తిరిగి, "మహారాజా, ఇప్పటికైనా ఈ మనిషి వేట చాలించండి. మమ్మల్ని చాలా శ్రమ



పెట్టి మీరూ చాలా శ్రమపడ్డారు. రాజకుమార్తె రూపబాణుణ్ణి ప్రేమించటం అతని తప్పు కానే కాదు. అతన్ని క్షమించి, సఖ్యం చేసుకుని, అతనికి తగిన సన్మానం కూడా చెయ్యవలిసిందని మా సలహా. గుప్పెడు నేరేడు పళ్ళు ఇచ్చినందుకు మీరు జాగీర్లిస్తామన్నారు. ఆ నేరేడు పళ్లు ఇచ్చినవాడు రూపబాణుడు! అతను రాక్షసుణ్ణి కూడా చంపాడు!" అన్నారు.

పరిస్థితి విషమించిందని గ్రహించి వీరసింహుడు రూపబాణుణ్ణి క్షమించి, అతనికీ మల్లికకూ వివాహం చేయించి, ఒక చిన్న రాజ్యానికి అతన్ని స్వతంత్ర రాజుగా కూడా అభిషేకించాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, రూపబాణుడు రాజభక్తి కలవాడై ఉండికూడా, తెలివిగలవాడై ఉండికూడా ఆడదాని మాట జవదాటలేక రాజుగారిని శత్రువును చేసుకుని, రాక్షసుడి చేతిలో చచ్చినంతపని ఎందుకు చేశాడు? ఆమెను పెళ్ళాడాలన్న కోరిక అతనికి లేదుగదా, అలాటప్పుడు ఆమెతో తాను పారిపోకుండా ఉంటే అతనికి ఈ కష్టాలేవీ దాపరించవుగద! వీటిని ఎందుకు కొని తెచ్చుకున్నాడు? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "నీటిలో పడిన వాణ్ణి రక్షించేవాడు తడవక తప్పదు. మల్లిక అసహాయస్థితిలో ఉండటంచేతా, తాను శక్తిమంతుడు కావటంచేతా ఆమెను రక్షించే భారాన్ని రూపబాణుడు తనపై వేసుకున్నాడు. అసహాయురాలికి సహాయం చేసేవాడు ఆమె అసహాయత్వంలో భాగం పంచుకోక తప్పదు. అందుకే రూపబాణుడు అన్ని కష్టాలూ పడ్డాడు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కాగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# దొంగల కొలువు

భీమన్న దొంగల వద్ద పనికి కుదిరిన కొద్ది కాలంలోనే, వాడికి అంతులేని శరీరబలం తప్ప బుద్ధిబలం కొంచెంకూడా లేదని దొంగలకు తెలిసిపోయింది. అందుచేత వాళ్ళు భీమన్నకు యుక్తిగల పనులేవీ చెప్పక, అతడిచేత బండపనులు మాత్రమే చేయిస్తూ వచ్చారు. భీమన్న ఎంతెంత బండ పనులనూ సునాయాసంగా చేస్తూవచ్చాడు.

ఒకనాటి రాత్రి దొంగలు ఒక ధనికుడి ఇంట దొంగతనం చెయ్యటానికి భీమన్నను వెంట తీసుకుని బయలుదేరారు. వాళ్ళు యుక్తిగా ఇంటికి కన్నం తవ్వి, లోపలికి భీమన్నను పంపుతూ, "లోపల కాస్త బరువుగా కనిపించే వస్తువులు మాత్రమే చూసి, వాటిని తెచ్చి, ఈ కన్నంలో నుంచి మాకు అందించు," అన్నారు. వాళ్ల ఉద్దేశం వెలగల వస్తువులన్నీ బరువైన పెట్టెలలో వుంటాయని.

భీమన్న దొంగలు చెప్పినదానికి సరేనని, ఇల్లంతా తిరిగి కనిపించిన వస్తువల్లా ఎత్తి చూశాడు. పెద్ద పెద్ద పెట్టెలుకూడా వాడికి తేలికగానే కనిపించాయి. చివరకు వాడికి వంట ఇంట్లో రుబ్బురోలు కనిపించింది. దాన్ని కదిలిస్తే కదిలిందిగాని, ఎత్తబోతే లేవలేదు.

"ఇదే దొంగలకు కావలిసిన వస్తువు. ఎవరైనా సాయంపట్టి భుజానికెత్తితే పట్టుకు పోవచ్చు," అనుకుంటూ భీమన్న అటూ ఇటూ చూసేసరికి, వంట ఇంట్లోనే మూలగా పడుకుని నిద్రపోతున్న వంటవాడు కనిపించాడు.

భీమన్న వాడి దగ్గిరికి వెళ్లి తట్టి లేపుతూ, "ఏమండోయ్, కాస్త లేచి ఈ రుబ్బురోలు సాయం పట్టండి," అని అడిగాడు.

వంటవాడు గాబరాపడుతూ లేచి కూచుని, "ఎవరు నువు? రుబ్బురోలు

సాయం పట్టటమేమిటి?" అని భీమన్నను అడిగాడు.

"ఇది దొంగలకు కావాలట. వాళ్ళు కన్నం దగ్గిర వేచి ఉన్నారు. ఈ రోలు నే నొక్కణ్ణీ ఎత్తలేకుండా వున్నాను!" అన్నాడు భీమన్న. వంటవాడు, "దొంగలు! దొంగలు!" అని కేకలు పెట్టాడు. అందరూ లేచి భీమన్నను పట్టుకున్నారు. ఈ అల్లరి ఆలకించి దొంగలు అప్పుడే పారిపోయారు. ఇంటి వాళ్ళు గుండు భీమన్నను రకరకాలగా ప్రశ్నించి, వాడు వట్టి మడ్డి వెధవ అని తెలుసుకుని, వదిలిపెట్టేశారు. వాడు దొంగలను వెతుక్కుంటూ వెళ్ళాడు.

దొంగలు వాణ్ణి నానా తిట్లూ తిట్టారు. వాణ్ణి కొలువులో నుంచి తీసేద్దామనుకున్నారు, కాని వాడు ఇకమీద బుద్ధిగా ఉంటా ననటం వల్ల క్షమించి తమ వెంట వుంచుకున్నారు.

మరొకనాడు దొంగలు ఒక జమీందారు ఇంట దొంగతనానికి బయలుదేరారు. వారి వెంట భీమన్నకూడా వున్నాడు. వాళ్ళు ఈసారి కన్నం వేసి, భీమన్నను ఇంట్లోకి పంపుతూ, "కిందటిసారి లాగా రుబ్బురోళ్ళ జోలికి పోకు. ఈ ఇసక తీసుకో. మిద్దెమీదికి వెళ్ళి అంతటా ఇసక చల్లు. ఏ వస్తువుమీద ఇసక పడ్డప్పుడు గలగలా శబ్దం అయితే



ఆ వస్తువునల్లా పట్టుకురా!" అని చెప్పారు. భీమన్న దొంగల వద్ద నుంచి ఇసక మూట తీసుకుని మిద్దె మీదికి వెళ్ళాడు. అక్కడ చాలామంది పడుకుని నిద్రపో తున్నారు. కొందరు నోర్లు తెరుచుకుని మరీ నిద్రపోతున్నారు.

"దొంగలు ఇసక చల్లమన్నారుగదా! ఇసక చల్లితే అది వాళ్ళ మొహాలమీదా, నోళ్ళలోనూ పడదా?" అనుకుని భీమన్న గట్టిగా, "ఓ హెూయ్, నేను ఇసక చల్లబో తున్నాను. నిద్రలుపోయే వాళ్ళంతా ముసు గులు పెట్టేసుకోండి!" అని కేకలుపెట్టాడు. ఈ కేకలకు అందరూ లేచారు. అల్లరి అయింది. దొంగలు పారిపోయారు. ఇంటి వాళ్ళు భీమన్ననుకూడా కొంత సేపయాక వెళ్ళిపోనిచ్చారు. వాడు మళ్ళీ దొంగల వద్దకు తిరిగి వెళ్ళాడు.

ఈసారి భీమన్న దొంగలచేత తిట్లూ, తన్నులూకూడా తిన్నాడు. వాడు క్షమించ మని ప్రాధేయపడ్డాడు. "ఇంకోసారి ఇలా చేశావంటే ఏకంగా నీ తల తీసేస్తాం. ఒళ్లు జాగ్రత్త పెట్టుకుని ఉండు!" అని దొంగలు వాణ్ణి గట్టిగా హెచ్చరించారు.

తరవాత ఒకరోజున దొంగలు రాజుగారి దివాణాన్ని కొల్లగొట్టటానికి బయలుదేరారు. ఆ దివాణంలో ధాన్యపు కొట్లూ, పశువుల



సాలలూ, రకరకాల గిడ్డంగులూ ఉన్నాయి. ఒక్కొక్క ఇంటినే దోచుకోవటానికి ఒక్కొక్క దొంగ ఏర్పాటయాడు. భీమన్నను మాత్రం దివాణం వెలపల నిలబడి, ప్రమాద పరిస్థితి ఏర్పడితే కొమ్ముబూరా ఊదేటట్టు ఏర్పాటు చేసుకున్నారు. ఆ బూరా మోత వినగానే ఎక్కడి దొంగ అక్కడి నుంచి జారుకుంటా డన్నమాట.

దొంగలందరూ తలా ఒక దారినా దివాణం లోకి వెళ్ళిపోయాక భీమన్న కొంచెంసేపు ఒంటరిగా నిలబడి, "ఎక్కడా ప్రమాదం జాడ లేదులే!" అనుకుని తానుకూడా లోపలికి జొరబడ్డాడు. లోపలికి పోగానే వాడికి ఎదురుగా పశువులశాల కనిపించింది. అందులో ఒక దొంగ ఒక ఆవును విప్ప టానికి ప్రయత్నిస్తున్నాడు. అది పొగరు బోతు ఆవు. దగ్గిరికి వస్తే తల విసురు తున్నది. ఒకే మనిషి దాని కొమ్ములు పట్టు కుని పలుపు విప్పటానికి లేదు.

అందుచేత ఆ దొంగ, తన దగ్గిరికి వచ్చిన వాడు భీమన్న అనికూడా గమనించకుండా, "ఒరే, బాబూ! కాస్త కొమ్ముపట్టు!" అన్నాడు. వెంటనే భీమన్న చంకలో నుంచి కొమ్ము బూరా తీసి "తుర్రోం" అని పెద్దగా ఊదాడు.

ఈ చప్పుడుకు రాజ భటులు మేలు కున్నారు. బూరా చప్పుడు బయటి నుంచి కాక లోపలి నుంచి ఎందుకు వచ్చిందా అని ఆశ్చర్యపోతూ దొంగలు ఎక్కడివా ళ్ళక్కడే నిలబడిపోయి, రాజ భటులకు దొరికిపోయారు.

రాజుగారు దొంగలందరినీ విచారించి కారాగృహంలో యావజ్జీవ శిక్ష విధించాడు. దొంగలను పట్టిచ్చినందుకు భీమన్నకు అయిదువందల రూపాయలు నగదు బహు మతీ, వాడి వేలికి ఖరీదైన ఉంగరమూ దొరికాయి. వాటితోసహా వాడు తన ఇంటికి బయలుదేరాడు.






# ఖలీఫాల సౌత్తు

ఖలీఫా హారూన్ అల్ రషీద్ మనమడికి మనమడైన అల్ ముతసిద్ బిల్లా అనే ఆయన అరవ ఖలీఫాగా బాగ్దాదు నగ రాన్ని పరిపాలించిన కాలంలో ఒక సంఘ టన జరిగింది.

ఒకనాడు ఖలీఫా తన అంతరంగికు డైన హమ్దూన్‌తో సహా మారు వేషంలో నగరమంతా తిరుగుతూ ఒక పాలరాతి ఆసనంపై కూచుని విశ్రాంతి తీసుకుంటూ ఉండగా ఆయన కెదురుగా ఒక తోటా, తోట మధ్య కనపడీ కనపడకుండా ఉన్న ఒక అందమైన భవనమూ కనిపించాయి. ఖలీఫా బుద్ధి నిశితమైనది. అందుచేత ఆయన ఆ ఇల్లు గలవాడి అభిరుచులూ, బుద్ధీ దొడ్డవి అని గ్రహించాడు.

అంతలోనే ఆ ఇంటికి చెందిన ఇద్దరు నౌకరు కుర్రవాళ్ళు తమలో తాము అను కుంటున్న మాటలు ఖలీఫా చెవినపడ్డాయి.

"ఇవాళ అయ్యగారికి అన్నం సయిం చదు. ఆయన పంక్తిన భోజనం చెయ్యు టానికి ఒక్క అతిథి అయినా రాలేదు," అని ఒక కుర్రాడు అన్నాడు.

"ఎవరైనా తోట చూడటానికి వచ్చినా ఎంతో బాగుండును," అని రెండోవా డన్నాడు. ఈ మాటలు విని ఖలీఫా తన అను చరుడితో, "విన్నావా, హమ్దూన్? అస్త మానం అతిథుల కోసం అలమటించే ఈ పెద్దమనిషి చాలా విచిత్రమైన వ్యక్తి కాదూ?" అన్నాడు.

"అటువంటి మనిషి పరిచయం తప్పక సంపాదించ దగినదే," అన్నాడు హమ్దూన్. అతను ఖలీఫా అనుమతితో ఆ కుర్రాళ్ళను సమీపించి, "ఇద్దరు దూరదేశపు వర్తకులు దర్శనానికి వచ్చారని మీ యజమానితో చెప్పండి," అన్నాడు. కుర్రాళ్ళు పరమా నందంతో పరిగెత్తి పోయారు.

సి. మాధవరావు



కొద్ది సేపటికల్లా ఆ ఇల్లు గల వాడు వచ్చి మారు వేషాలలో ఉన్న ఖలీఫాకూ, ఆయన అంతరంగికుడికీ స్వాగతం తెలిపి, లోపలికి తీసుకు పోయాడు. వారికి చక్కని భోజనమూ, మేలైన పానీయాలూ లభించాయి. ఈ ఆతిథ్యంతో హమ్దూన్ పరవశుడై పాటలు పాడాడు. కాని ఖలీఫా మొహంలో చిరునవ్వు చిందటానికి మారుగా తీవ్రమైన కోపం కనిపించ నారంభించింది. ఆయన ఇంటి యజమానిని, "ఎవరవోయ్ నీవూ?" అని కఠినంగా, కోపంగా ప్రశ్నించాడు.

"నన్ను అబూ అల్ హసన్ అలీ ఇబిన్ అహ్మద్ అంటారు," అన్నాడు గృహస్థు.

"నే నెవరో నీకు తెలుసా?" అని ఖలీఫా అహ్మద్‌ను అడిగాడు.

"క్షమించాలి. నాకు తమ పరిచయ భాగ్యం లేదు," అన్నాడు అహ్మద్.

అంతలోనే హమ్దూన్ కలగజేసుకుని ఖలీఫాను అతనికి ఎరుక పరిచాడు. అహ్మద్ ఖలీఫా కాళ్ళపై పడి, "నేను నేరక ఏ అపచారమైనా చేసి ఉంటే ప్రభువులు మన్నించాలి. నా ఆతిథ్యంలో అమర్యాదగాని, అశ్రద్ధగాని కనబరిచానేమో!" అన్నాడు.

"అలాటి దేమీలేదు. నీ ఆతిథ్యం రాజోచితంగా ఉన్నది. అందులో ఏ వంకా లేదు," అన్నాడు ఖలీఫా.

"అయితే ఈ దాసుడి వల్ల జరిగిన అపచార మేమిటో చెప్పండి," అన్నాడు అహ్మద్.

"నీ ఇంట గల వస్తువులమీదా, నీ బట్టల మీదా మా తాతగారైన ఖలీఫా అలా అల్లా చిహ్నాలున్నాయి. ఇది ఎలా సాధ్యమయింది? మా పూర్వీకుల ఆస్తి కొల్ల గొట్ట సాహసించావా? సంజాయిషీ చెప్పలేకపోతే నీ ప్రాణం దక్కదు సుమా!" అన్నాడు ఖలీఫా.

ఈ మాటలకు అహ్మద్ చిరునవ్వు నవ్వాడు. అతని మనసు స్థిమిత పడింది. "నా కథ చెబుతాను, ఆలకించండి," అంటూ అతను చెప్ప నారంభించాడు:

గొప్ప వంశంలో పుట్టినవాడు కానప్పటికీ మా తండ్రిగారు ఆయన కాలంలో బాగ్దాదు లోని వర్తకు లందరిలోకీ గొప్ప ధనికుడు, గౌరవం పొందినవాడు. ఆయనకు నగరం అన్నిమూలలా దుకాణాలుండేవి. ఆయన ఆస్తికి నేను వారసుణ్ణి అయాక ఏ లోటూ లేకుండా సుఖంగా జీవిస్తూ, నేను ఆనందం పొందుతూ, నా ఆప్త మిత్రులకు ఆనందం చేకూర్చుతూ, ఒడుదొడుకులు లేక ప్రశాం తంగా కాలం వెళ్ళబుచ్చ సాగాను.

ఇలా ఉండగా, ఒక నాడు నేను ఒక దుకాణం ముందు కూచుని ఉన్న సమ యంలో, ఒక చక్కని ఆడపిల్ల 'దుకాణం బయట నిలబడి, "అబూ అల్ హసన్ ఇబన్ అహ్మద్ దుకాణం ఇదేనా?" అని అడిగింది. అప్పుడే యౌవనంలోకి అడుగు పెడుతున్న ఆ పిల్లను చూస్తూనే నాకు ప్రేమ పుట్టు కొచ్చింది. నేనే అహ్మద్‌ననీ, అది నా దుకాణమేననీ నేను చెప్పిన మీదట ఆమె లోపలికి వచ్చి కూచుని, "నాకు మూడు వందల దీనారాలు కావాలి. మీ గుమాస్తాను ఎంచి ఇవ్వ మనండి!" అని ఆజ్ఞాపించింది. నా ఆజ్ఞ ప్రకారం నా షరాబు ఆమెకు డబ్బిచ్చాడు. ఆ డబ్బు తీసుకుని, వెళ్ళి వస్తాననికూడా చెప్పకుండా ఆమె ఠీవిగా తన దారిన వెళ్ళిపోయింది.





"ఈ మొత్తం ఏ పేర ఖాతా రాయమన్నారు?" అని షరాబు నన్ను అడిగాడు.

"నాకుమటుకేం తెలుసు? ఖాతా పుస్తకాలలో అప్సరసల పేర్లుంటాయా?" అని ఎదురు అడిగాను. మా షరాబు అంతటితో పోనివ్వక ఆమె వెనకాల పరిగెత్తి వెళ్ళి, ఆమె పేరు అడిగి, ఆమెచేత మొహం పగిలేటట్టు కొట్టించుకుని, బిక్క మొహంతో తిరిగి వచ్చాడు. ఆ రోజల్లా ఆమెనే తలుచుకుంటూ గడిపాను. మర్నాడామె ఏమీ జరగనట్టు నవ్వుతూ మళ్ళీ మా దుకాణానికి వచ్చి నన్ను చూస్తూనే, "నిన్న మీకు మంచి తోకరా ఇచ్చానను కున్నారుగాదూ?" అన్నది.

"అల్లా సాక్షిగా నేనలా అనుకోలేదు. నీసొత్తే నీవు తీసుకుపోయావు. ఈ దుకాణం నీది, నేనుకూడా నీ సొత్తే!" అన్నాను.

"అలా అయితే నాకు అయిదువందల దీనారాలు కావాలి," అన్నదామె. ఆమెకు కోరిన ధనం ఇచ్చాను. దాన్ని తీసుకుని ఆమె మాటా పలుకూ లేకుండా వెళ్ళిపోయింది. ఆ తరవాత రోజు ఆమె దుకాణానికి వచ్చి, వెలగల రత్నాలు పరిచివున్న ముఖ్మల్ గుడ్డ కేసి వేలు చూపింది. రత్నాలతో సహా ఆ ముఖ్మల్ ఆమె కిచ్చేశాను.

ఇలా మూడు రోజులు జరిగాక, ఇక నాకు చేతులు కట్టుకు కూచోవటం భావ్యం కాదనిపించింది. మా షరాబులాగా ఆమె చేత మొహం పగల గొట్టించుకోవటానికి కూడా నేను సిద్ధమయాను. అందుచేత ఈ సారి నేను ఆమె వెనకనే బయలు దేరాను. త్వరలోనే ఆమె టిగ్రిస్ నదిని చేరి, ఒక చిన్న తెప్పలో నది దాటి, మీ తాతగారి భవనం ప్రవేశించింది. ఆమెను సాధించటం ఎంత దుర్లభమో నాకు అర్థమయింది.

నేను ఇంటికి వెళ్ళి మా అమ్మతో, నే నొక పిల్లను మనస్ఫూర్తిగా ప్రేమించాననీ, ఆమె ఖలీఫాగారి దివాణానికి చెందినదనీ, అయినా ఆమెను పెళ్ళాడటానికి కాయ

శక్తులా యత్నించబోతున్నాననీ చెప్పాను. "సుఖాన ఉన్న ప్రాణాన్ని నిష్కారణంగా ఎందుకు కష్ట పెట్టుకుంటావు? ఆ అమ్మాయి ప్రసక్తి మానుకో!" అన్నది మా అమ్మ.

"అమ్మా, రాసిపెట్టి వున్నది జరగకుండా ఉంటుందా? అన్నిటికీ అల్లా ఉన్నాడు," అన్నాను. మర్నాడు ఉదయం నేను మా నగల దుకాణంలో ఉండగా నా పచారీ వ్యాపారం చూసే ముసలాయన వచ్చాడు. మా తండ్రికి ఆయన అంటే ఎంతో గురి. ఆయన నన్ను చూడగానే జబ్బు పడ్డా నను కున్నాడు. ప్రేమ తప్ప మరొక రోగమేమీ లేదని, ఆయనతో జరిగినదంతా చెప్పాను.

ఆయన అంతా విని, "పెద్ద చిక్కే! అయినా ఖలీఫా దివాణంలో నాకు తెలిసిన దర్జీ ఉన్నాడు. అతడు దివాణం నౌకర్లకు బట్టలు కుట్టుతాడు. అతన్ని నీకు పరిచయం చేస్తాను. అతని కేదైనా పని కల్పించి, దండిగా డబ్బిస్తే నీకు ఏదో విధంగా సహాయపడవచ్చు," అన్నాడు.

ఆయన నన్ను రాజ ప్రాంగణంలో దర్జీ ఉండే ఇంటికి తీసుకుపోయాడు. నేను పని పెట్టుకుని నా అంగీ జేబు చించుకుని, కుట్టమని దర్జీ కిచ్చాను. అతను కుట్టు తెలియరాకుండా కుట్టేశాడు. నే నాతని చేతిలో పది బంగారు దీనారాలుంచాను.







లోపలికి వచ్చి గోడలకు తగిలించి ఉండే ఉడుపులలో ఒక చొక్కా చూసి, దాని ధర ఎంత అని దర్జీని అడిగాడు. నేనా చొక్కా తీసి వాడి చేతికిచ్చి, "తీసుకో. దీని ధర అదివరకే దర్జీకి ముట్టింది," అన్నాను.

ఆ కుర్రాడు నా కేసి చూసి కొంటెగా నవ్వి, చెయ్యి పట్టుకుని నన్ను ఎడంగా తీసుకుపోయి, "మీరు అబూ అల్ హసన్ ఇబన్ అహ్మద్ కారా?" అన్నాడు.

"అరె, నీ కెలా తెలిసింది?" అన్నాను.

"తెలీకుండా ఎలా ఉంటుందీ? రోజుకు యాభై సార్లయినా మా దొరసాని మీ పేరు అనుకుంటుంది గద! ఆమెకు మీ మీద ఉండే ప్రేమలో మీకు ఆమె మీద సగం ఉన్నప్పటికీ మిమ్మల్ని ఏదో విధంగా ఆమె ఉన్న చోటికి చేర్చగలను," అన్నాడు కుర్రాడు నవ్వుతూ.

నేను మోతీ కోసం ప్రాణాలివ్వటానికైనా సిద్ధంగా ఉన్నానని తెలిసినాక వాడు నన్ను అక్కడే ఉండమని, వెళ్ళిపోయి కొద్దిసేపట్లో ఒక సంచీతో తిరిగి వచ్చాడు. ఆ సంచీలో ఖలీఫా పేరుగల పచ్చడపు తొడుగు ఉన్నది. ప్రతి రాత్రీ ఖలీఫా అలాటి ఉడుపు ధరించి అంతఃపురానికి వెళతాడట. ఆయన అభిమాన స్త్రీల గదులు ప్రత్యేకంగా ఒక

దర్జీ నా కేసి వింతగా చూసి, "బాబూ, మీ ప్రవర్తన వింతగా ఉందే. మీరు గాని ప్రేమపాశంలో చిక్కుకో లేదు గద?" అన్నాడు. దివాణంలో ఉండే ఒకానొక పిల్ల నా మనస్సు దొంగిలించిందనీ, ఆమె పేరు కూడా నాకు తెలియదనీ చెప్పి, ఆమెను వర్ణించాను. అంతా విని దర్జీ, "మీరు చెప్పే పిల్ల తప్పక మోతీ అయి ఉంటుంది. ఖలీఫాగారు ఆమె చేత పాటలు పాడిస్తూ ఉంటారు," అన్నాడు.

అంతలోనే దర్జీ దుకాణంకేసి ఒక నౌకరు కుర్రాడు వస్తూ కనిపించాడు. ఆ వచ్చేవాడు మోతీ నౌకరేనని దర్జీ చెప్పాడు. కుర్రాడు

వరసలో ఉంటాయట. ఆ గదుల మధ్యగా నడిచేటప్పుడు ఆయన ప్రతి వాకిలి వద్దా ప్రత్యేకంగా ఉంచే గిన్నెలలో గురిగింజంత కస్తూరి ఉంచుతాడట. కుర్రాడు నాకీ వివరాలన్నీ చెప్పి, "అదే నడవ వెంబడి పోతూంటే నీకు నీలపు చలవరాతితో కట్టిన మండిగం గల ద్వారం కనిపిస్తుంది. ఆ వాకిలి తలుపు తెరుచుకుని లోపలికి వెళితే మా దొరసాని గారు కనిపిస్తుంది," అని చెప్పాడు.

నేను ఎన్నడూ ఇలాటి తెగువమారి పనులు చేసినవాణ్ణి కాను. అయినా ఇంత దూరం వచ్చాక ముందుకు పోక తప్పదు. అందుచేత నేను ఖలీఫా ఉడుపులు ధరించి, కస్తూరి డబ్బీ చేతబట్టి రాజభవనపు నడవల వెంబడి రోజూ తిరిగే వాడిలాగానే నడుచుకుంటూ ఖలీఫా అభిమాన స్త్రీలుండే నడవ ప్రవేశించి, ఒక్కొక్క ద్వారబంధానికి గల గిన్నెలలో కస్తూరి ఉంచుతూ ముందుకు పోసాగాను. ఇలా పోతూ నేను నీలపు చలవరాతి మండిగం గల ద్వారం చేరి తలుపు తెరవబోతూండగా నా వెనక మనుషుల అలికిడి అయింది. తిరిగి చూసేసరికి బోలెడన్ని దివిటీలు కనిపించాయి. ఖలీఫాయే వస్తున్నారు!

నా ప్రైప్రాణాలు పైనే పోయాయి. నేను వెనక్కు పోవటానికి లేదు. అందుచేత



ముందుకే పరిగెత్తాను. ఎంతదూరం పరిగెత్తుతాను? ఎక్కడికని పోతాను? ఎక్కడైనా దాక్కుందామనే ఉద్దేశంతో కనిపించిన తలుపు ఒకటి తోసి గబగబా లోపల జొరబడ్డాను.

నన్ను చూడగానే లోపల ఉన్న స్త్రీ భయంతో లేచి నిలబడి, ముఖానికి మేలి ముసుగు అడ్డం వేసుకున్నది. ఆమె ఒక్క కేక పెడితే నాకు ఆయువు మూడుతుంది. నాకు శిరచ్ఛేదమో, కొరతో తప్పదు. ఆ కుర్ర వెధవను నమ్మి ఈ ఊబిలో దిగినందుకు నన్ను నేనే తిట్టుకుంటూ ఆ స్త్రీ కేసి వెర్రిగా చూడసాగాను.

ఇంతలోనే మేలి ముసుగు వెనక నుంచి ఏంత మాటలు వెలువడ్డాయి. "అబూ అల్ హసన్‌గారా? స్వాగతం. నా చెల్లెలికి మీరంటే ప్రాణం. అది మీకు గట్టి పరీక్ష పెట్టింది. పరీక్షలో మీరు నెగ్గారు. అదృష్ట దేవత మిమ్మల్ని నా గదికి పంపింది గాని, ఇంకే గదిలోకి అడుగుపెట్టినా మీ ప్రాణానికి ముప్పు వచ్చి ఉండేది. మీరేమీ భయపడకండి. నేను మీకు సహాయం చేస్తాను. కాని ముందు నాకు ఒక విషయం చెప్పండి. మోతిని ఏం చేద్దామని మీ ఉద్దేశం?" అన్నది ఆ స్త్రీ.



"అమ్మా, ప్రమాణ పూర్తిగా నాకు మీ చెల్లెలి పట్ల ఎలాటి దుర్భావమూ లేదు. ఆమెను ఒకసారి చూస్తే చాలు నేను ధన్యుణ్ణి అవుతాను!" అన్నాను.

ఆమె చప్పట్లు చరిచి నౌకరు కుర్రాణ్ణి పిలిచి, "ఒరే, మా చెల్లెలు మోతీ గదికి వెళ్ళి, నేను రమ్మంటున్నానని చెప్పి పిలుచుకురా!" అన్నది.

మోతీ వచ్చింది. నన్ను చూడగానే ఏమాత్రమూ బిడియంలేకుండా చేతులు చాచి నా దగ్గిరికి పరిగెత్తుకు వచ్చింది. అదే సమయంలో బయట అలికిడి అయింది. అక్కచెల్లెళ్ళు నన్నొక పెద్ద పెట్టెలో పెట్టి

తాళం వేశారు. కొద్ది క్షణాలకల్లా ఖలీఫా ఆ గదిలోకే వచ్చారు.

ఆయన వాళ్ళిద్దరినీ చూసి, "ఓహో, అక్కచెల్లెళ్ళు ఒక చోటే ఉన్నారా? మోతీ, రెండు రోజులుగా ఎక్కడ మాయమయావు? నీ పాట విని ఎంతో కాలమైనట్టున్నది. ఏదీ? ఒక్క మంచి పాట పాడు!" అన్నారు.

మోతీ అసలే ఆనంద పారవశ్యంలో ఉన్నదేమో, దివ్యంగా పాడింది. ఖలీఫా పరమానందంచెంది, "నీ కంఠంలో ఎంత మాధుర్యం ఉన్నది, మోతీ! నా అర్ధరాజ్య మైనప్పటికీ ఇస్తాను, ఏం కావాలో కోరుకో!" అన్నారు.

"ప్రభువువారు, నన్నూ, మా అక్కనూ ఇలాగే దయగా చూస్తే చాలు, ఇంకేమీ అక్కర్లేదు," అన్నది మోతీ.

"నే నిచ్చేదీ, నీవు పుచ్చుకునేదీ ఏదో ఒకటి అడుగు!" అన్నారు ఖలీఫా ఎంతో ఆప్యాయంగా.

"అలా అయితే, నా బానిసత్వం తొలగించండి. ఈ గదిలో ఉండే సామగ్రి యావత్తూ నా కిప్పించండి," అన్నది మోతీ.

"ఇచ్చేశాను!" అన్నారు ఖలీఫా.

తరవాత ఆయన వెళ్ళిపోయారు. మోతీ నౌకర్లను పిలిచి గదిలో ఉండే సామానంతా తీయించి, నేనున్న పెట్టెతో సహా సమస్తమూ మా ఇంటికి చేర్పించింది. ఇంక చెప్పవలిసిందేముందీ? ఆ రోజే నేను మోతీని శాస్త్రోక్తంగా పెళ్ళాడాను.

ఈ విధంగా మీ తాతగారి సామగ్రీ, దుస్తులూ నాకు లభించాయి. ఇందులో నేను ఒక్క ముక్క దాచ లేదు, ఒక్క ముక్క కల్పించలేదు.

అహ్మద్ చెప్పిన ఈ కథ విని ఖలీఫా అల్ ముతసిద్ బిల్లా పరమానందం చెందాడు. ఆయన అహ్మద్‌కు పన్నులన్నీ రద్దు చేయించి, తన అంతరంగికుల్లో ఒకడుగా నియమించి ఆదరించాడు.





# నిండు కుండ

ఒక గ్రామంలో ఒక రైతుకు ఒక కొడుకుండేవాడు. వాడి పేరు సోములు. వాడు నిండు కుండ. అందుచేత వాడి ధైర్యసాహసాలను గురించిగాని, శక్తి సామర్థ్యాలను గురించిగాని ఎవరికీ తెలియదు.

ఒక రోజు సోముల్ని తండ్రి పొలానికి అంబలి తీసుకు పొమ్మన్నాడు. ఎందుకంటే పొలంలో కూలిజనం పనిచేస్తున్నారు. సోములు ప్రమాదవశాత్తూ దారిలో అంబలి ఒలక పోసుకున్నాడు.

తండ్రి సోముల్ని నానా మాటలూ అని, "నువ్వు వట్టి పనికిరాని వాజమ్మవు. నీకు తిండి పెట్టటం కూడా దండగ. వెళ్ళి నీ బతుకు నువ్వు చూసుకో," అన్నాడు.

"అంత మాట పడి నేను మాత్రం ఎందుకుంటాను. నాకు మంచి ఇనప గద చేయించి పెట్టు. అంతకంటె నా కేమీ అక్కర్లేదు," అన్నాడు సోములు.

రైతు కమ్మరివాడి దగ్గిరికి వెళ్ళి, అర మణుగు బరువు గల ఇనప గద చేయించుకొచ్చి సోములు కిచ్చాడు. సోములు దాన్ని పట్టి ఒక్క ఊపు ఊపేసరికి నడిమికి రెండుగా విరిగింది. రైతు ఈసారి మణుగు బరువు గల గద చేయించు కొచ్చాడు. అది రెండు ఊపులకు రెండుగా విరిగింది. రైతు రెండు మణుగుల గద చేయించు కొచ్చాడు. సోములు ఊపిన ఊపులకు అది వంగిందే గాని విరగలేదు.

"ఫరవాలేదు, పనికొస్తుంది," అంటూ సోములు గదను మోకాలికి పెట్టి వంకర తీసి, ఆ గదను భుజాన వేసుకుని ఉద్యోగం కోసం రాజుగారుండే నగరానికి వెళ్ళాడు.

"నీకేం పని చాతనవు?" అని రాజుగారు అడిగాడు.

"పశువుల్ని మేపటం తప్ప నా కింకేమీ చేతకాదు," అన్నాడు సోములు.

టి. అంజనేయులు



"నాకు కావలిసిందే పశువుల కాపరి. జీతం ఎంత ఇవ్వమంటావు?" అన్నాడు రాజుగారు.

"తిండి పెట్టి ఏడాదికి నూరు రూపాయ లిస్తే చాలు," అన్నాడు సోములు.

"జీతం ఎక్కువగానే అడిగావు. అయినా నా ఆవులు మాయం కాకుండా చూశావంటే నువ్వడిగిన జీతం ఇస్తాను. ఎంతోమంది పశువుల కాపర్లను పెట్టాను. నా ఆవులు ఒక్కొక్కటిగా మాయమవుతున్నాయి," అన్నాడు రాజు.

"మీ ఆవులు మాయం కాకుండా నేను చూస్తాను," అని మాట ఇచ్చి, సోములు రాజుగారి పశువుల కాపరిగా కుదిరాడు. మర్నాడు వాడు పెందలాడే లేచి, తన గద చంకన పెట్టుకుని, ఆవుల మందను తోలుకుని కొండల మధ్యకు వెళ్ళాడు. బీట్లో పశువులు మేస్తుంటే సోములు చితుకులు ఏరసాగాడు.

ఇంతలో ఒక రాక్షసుడు భూమి దద్దరిల్లేలాగా అంగలు వేసుకుంటూ సోములున్న చోటికి వచ్చి, పెద్ద బొంగురు గొంతుతో, "ఎవర్రా నువ్వు?" అని అడిగాడు.

"అయ్యో, బాబోయ్! ఉలిక్కిపడితిని గదయ్యా! నే నసలే పిరికివాణ్ణి! నీ కేదన్నా ఆవు కావాలంటే తీసుకుని పోరాదూ?" అన్నాడు సోములు, తల ఎత్తి రాక్షసుణ్ణి చూసి. రాక్షసుడు మందలో ఉన్న ఆవుల్లో బాగా కొవ్విన ఆవునుగా చూసి, వెల్లికిలా పడేసి, అడవి తీగెలు తెంపి, వాటితో దాని కాళ్ళు నాలుగూ కలియ గట్టి, "ఒరే అబ్బాయి, దీన్ని భుజాన వేసుకుంటాను, కాస్త సాయం పట్టు!" అన్నాడు.

"అయ్యో, బాబోయ్! నిన్ను చూస్తేనే నాకు భయం వేస్తున్నది! నేను రాను!" అన్నాడు సోములు.

"నిన్నేమీ చెయ్యను, రారా!" అన్నాడు రాక్షసుడు.

సోములు భయపడుతున్నవాడల్లే రాక్షసుణ్ణి సమీపించి, "దాని కాళ్ళ సందున తల దూర్చు. నేను పట్టి ఆవును నీ వీపుకు ఎత్తుతా!" అన్నాడు.

రాక్షసుడు సోములు చెప్పినట్టే తన తలను ఆవు కాళ్ళ సందున దూర్చాడు. మరుక్షణమే సోములు వెనక నుంచి రాక్షసుడి మెడ మీద తన గదతో బలంగా ఒక్క వేటు వేశాడు. ఆ దెబ్బతో రాక్షసుడు చచ్చిపడ్డాడు.

సోములు రాక్షసుడి తల నరికి ఒక చెట్టు మీద ఆకుల గుబురులో దాచి, వాడి శరీరాన్ని వాగులో పూడ్చి పెట్టి, సాయంకాల మయాక మందతో సహా ఇంటికి బయలు దేరి వెళ్ళాడు.

రాజుగారు దారిలోనే ఎదురుపడి ఆవులన్నీ ఒక్కటీ బీరుపోకుండా ఇంటికి చేరటం చూసి ఆశ్చర్యపడుతూ, "అయితే, సోములూ, మంద మేసిన చోట విశేషాలేమిటి?" అని అడిగాడు.

"చెట్ల మీద ఆకులున్నాయి. వాగులో నీరుంది. అదేమంత విశేషం?" అన్నాడు సోములు.

మర్నాడు సోములు పశువులను తోలుకుపోయిన చోటికి ఇంకా పెద్ద రాక్షసుడు వచ్చాడు. కిందటి రోజు వచ్చిన వాడి అన్న వీడు. వీణ్ణికూడా సోములు అదే యుక్తితో చంపి, వాడి తల చెట్టు మీద గుబురులో దాచి, శరీరాన్ని వాగులో పూడ్చి, పొద్దు వాలగానే మందను తోలుకుని ఇంటికి వచ్చాడు. ఈ రోజు కూడా రాజుగారు వాడికి ఎదురు వచ్చి ఆవులన్నీ తిరిగి రావటం చూసి మరింత ఆశ్చర్యపోయి, "అయితే, సోములూ, ఏమిటి విశేషాలు?" అని అడిగాడు.

"పగలల్లా ఎండ గాసింది. ఆవులన్నీ పచ్చిక మేశాయి. అదే మంత విశేషం?" అన్నాడు సోములు.



"అంతేనా? ఇంకేమీ జరగలేదా?" అని రాజుగారు అడిగాడు.

"ఇంకే ముంటుం దబ్బా?" అన్నాడు సోములు.

మూడో రోజు ఇంకా పెద్ద రాక్షసుడు వచ్చాడు. వాణ్ణి కూడా సోములు అదే యుక్తితో చంపాడు. ఈ విధంగా ఇంకెంత మంది రాక్షసులు వస్తారో, ఏమవుతుందో నని వాడికి ఆశ్చర్యం కలిగింది.

నాలుగో రోజు వాడు బీట్లో పశువులను మేపుతూ, పుల్ల లేరుతూండగా చచ్చిపోయిన రాక్షసుల తల్లి వచ్చింది. "నా ముగ్గురు కొడుకులనూ మాయం చేసింది నువే నట్రా?" అంటూ ఆ రాక్షసిముండ సోములు మీద పడింది.

దాని బలం సోములు బలానికి ఏ మాత్రమూ తీసిపోదు. అయినా సోములు ఎలాగో దాని పట్టు తప్పించుకుని, తన గడతో దాని కాళ్ళు రెండూ విరగగొట్టేశాడు. అది కదలలేక, బాధ భరించలేక, తనను చంపెయ్యమని సోముల్ని బతిమాలింది.

"నీ బాధ నివారణ చేస్తాను, నాకే మిస్తావు?" అన్నాడు సోములు.

"ఈ దారిన పోతే మా గుహ వస్తుంది. అందులో పెట్టెడు బంగారమూ, పెట్టెడు వెండీ ఉన్నాయి. అవి తీసుకుని నా ప్రాణం తీసెయ్యి," అన్నది రాక్షసి. సోములు దాన్ని కూడా చంపేసి, దాని తల కూడా చెట్టు గుబురులో దాచి, శరీరం వాగులో పూడ్చాడు.

ఆ రోజు మటుకు రాజుగారు ప్రతిరోజూ లాగా సోములుకు ఎదురు రాలేదు. కారణం తెలుసుకుందామని సోములు రాజుగారి లోగిలికి వెళ్ళేసరికి అక్కడ ఏడుపులూ, పెడబొబ్బలూ సాగుతున్నాయి.

ఉత్తరపు వేపున గుహలో ఉండే మూడు తలల రాక్షసుడు ఆ మధ్యాహ్నమే వచ్చి, "సూర్యాస్తమయం లోపల మీ అమ్మాయిని నా గుహకు చేర్చకపోతే మీ ఇంటిల్లిపాతినీ

నాశనం చేస్తా," నని రాజుగారిని బెదిరించి వెళ్ళాడట. సోములు రావటానికి ముందే రాజకుమార్తెను వంటవాడి వెంట ఉత్తరపు గుహకు పంపించారు.

ఈ మాట వింటూనే సోములు తన గదతో సహా ఉత్తరపు గుహకు పరిగెత్తాడు. వాడక్కడికి చేరే సరికి రాజకుమార్తె గుహ బయట ఒక బండ మీద శోకదేవతలాగా కూచుని, కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తున్నది. వంటవాడు ఒక పెద్ద బండ రాయి చాటున నక్కి అంతా చూస్తున్నాడు.

సోములు అక్కడికి చేరగానే రాజకుమార్తెకు కొంచెం ధైర్యం వచ్చిందది. వాడు వంటవాడిలాగా భయపడక రాజకుమార్తె పక్కనే నిలబడి, "భయపడవద్దు. ఏమాత్రం అవకాశం ఉన్నా నేని రాక్షసుణ్ణి చంపేస్తాను," అన్నాడు.

సూర్యుడు అస్తమించబోతుండగా మూడు తలల రాక్షసుడు గుహ నుంచి బయటికి వచ్చాడు. చీకటిలో నుంచి వస్తూండటం చేత వెలుగు చూడలేక వాడు ఒక్క క్షణం పాటు కళ్ళు మూసుకున్నాడు. ఆ క్షణంలోనే సోములు తన చేతి గదను బలం కొద్దీ విసిరి రాక్షసుడి మెడ మీద ఒక్కటి పెట్టాడు. ఆ దెబ్బకు రాక్షసుడు చచ్చాడు గాని గద విసిరిన ఊపుకు సోములు బోర్లా



పడ్డాడు, వాడి చెయ్యి దోక్కుపోయి రక్తం కారింది. రాజకుమార్తె తన చీరె కొంగు చించి సోములు గాయానికి కట్టు కట్టింది.

తరవాత సోములు తనకు నిద్ర వస్తున్నదని చెప్పి తన ఇంటికి వెళ్ళిపోయాడు. వంటవాడు రాజకుమార్తెను ఆమె ఇంటికి చేర్చాడు. వాడు రాజుగారితో, "మహారాజా, ఎలాగో నేనా మూడు తలల రాక్షసుణ్ణి చంపి అమ్మాయిగార్ని కాపాడాను. రాక్షసుడు బెదిరించి వెళ్ళినాక తమరు, ఎవరన్నా ఆ రాక్షసుణ్ణి చంపగలిగితే వాడికి అమ్మాయిగారి నిచ్చి చేస్తామన్నారు. అందుచేత 'నాకు అమ్మాయిగారి నిచ్చి చెయ్యండి," అన్నాడు.

రాక్షసుణ్ణి చంపిన సోములు రాజుగారితో ఆ సంగతి చెప్పడని వంటవాడు రూఢి చేసుకున్నాడు. చెప్పేవాడైతే వాడు సరాసరి ఇంటికి వెళ్ళి నిద్రపోడు. ఇక రాజకుమార్తె తనను కాదని పశువుల కాపరిని పెళ్ళాడదని వాడనుకున్నాడు.

రాజుగారు వంటవాడి మాట నమ్మి మర్నాడే పెళ్ళి ఏర్పాటు చేశాడు. తెల్లవారి నిద్ర లేస్తూనే రాజకుమార్తె తనకు వంటవాడితో పెళ్ళి కాబోతున్నదని తెలుసుకుని, తండ్రిని ఇదేమిటని అడిగింది. అంతా విని ఆమె తన తండ్రితో, "నన్ను ఇవ్వదలిస్తే సోములు కివ్వండి. మూడు తలల రాక్షసుణ్ణి చంపినవాడు అతనే!" అన్నది.

రాజుగారు సోముల్ని పిలిపించి అడిగితే తాను చంపిన రాక్షసులందరి జాబితా చెప్పి, తాను వాళ్ళ గుహలో దాచుకున్న పెట్టెడు బంగారమూ, పెట్టెడు వెండీ ఇంటికి తెచ్చుకున్న సంగతికూడా బయటపెట్టాడు.

అన్నిటికన్నా సోములు నిండుకుండలాటి వాడన్నది రాజుగారికి ఎక్కువగా నచ్చింది. తనకు అంతకన్న మంచి అల్లుడు దొరకడని ఆయన తన కుమార్తెను సోములు కిచ్చి పెళ్ళిచేసి, అబద్ధాలాడిన వంటవాణ్ణి నగరం నుంచి వెళ్ళగొట్టాడు.






ఆ భార్యా భర్తల సంభాషణ అంతా వింటూ ఉండిన లక్ష్మణుడు, "అన్నా! నీవు అరణ్యానికి వెళ్ళటానికే నిశ్చయించి నట్టయితే నేను కూడా వస్తున్నాను," అన్నాడు. ఇందుకు రాముడు సమ్మతించక, "నీవూ, నేనూ కూడా వెళ్ళిపోతే మన తల్లులు కౌసల్యా సుమిత్రలు బొత్తిగా దిక్కులేని వాళ్ళవుతారు. వాళ్ళను కని పెట్టుకుని ఉండు," అన్నాడు.

లక్ష్మణుడు ఒప్పుకోలేదు. "నేను రాత్రి, పగలూ నీకు కావలసిన పనులన్నీ చేస్తాను. నేను నీ వెంట వచ్చితీరాలి," అన్నాడు.

రాముడు సంతోషించి సరే నన్నాడు. వసిష్ఠుడి వద్ద ఉండే దివ్యాయుధాలు తీసుకు రమ్మని లక్ష్మణుణ్ణి పంపాడు. వాటిలో అక్షయతూణీరాలూ, భయంకరాకారాలు గల ధనుస్సులూ, దుర్భేద్యమైన కవచాలూ, బంగారు పూతగల రెండు కత్తులూ ఉన్నాయి. లక్ష్మణుడు వెళ్ళి, తాను అడవికి పోతున్న సంగతి తన మిత్రులందరికీ చెప్పి, వసిష్ఠుడి వద్దనున్న ఆయుధాలు తెచ్చాడు.

తరవాత రాముడు యాత్రాదానాలు చేశాడు. వసిష్ఠుడి కొడుకైన సుయజ్ఞుణ్ణి పిలిపించి, ఆయన భార్యకు సీతచేత ఆమె నగలూ, మంచమూ, పరుపులూ దానం చేయించి, తాను శత్రుంజయమనే ఏనుగునూ, అనేక ఇతర ఏనుగులనూ ఇచ్చి పంపాడు. అగస్త్య కౌశికులనే బ్రాహ్మణులకూ, కౌసల్యను ఆశ్రయించుకుని ఉన్న





"రాజపుత్రా, నేను పేదవాణ్ణి. చాలామంది బిడ్డలు గలవాణ్ణి. ఇంత కాలంగా పరిగ ఏరుకు బతుకుతున్నాం. కాస్త నన్ను కటాక్షించు," అన్నాడు.

రాముడాయనతో నవ్వుతాలకు, "అయ్యా, నీవు నీ బలం కొద్దీ కర్ర విసురు. అది ఎంత దూరాన పడుతుందో అంత బారున గోవుల నిస్తాను," అన్నాడు.

ముసలి త్రిజటుడు నడుము బిగించి, ఒక కర్ర తీసుకుని గిరగిరా తిప్పి విసిరే సరికి, అది సరయూనది అవతలి గట్టున వెళ్ళి పడింది.

రాముడు త్రిజటుణ్ణి ఆప్యాయంగా కౌగలించుకుని, "అయ్యా, నవ్వుల కన్నాను, కోప్పడ వద్దు. నీ తపశ్శక్తి ఎంతో తెలుసుకుందా మనిపించింది. అన్నప్రకారం గోవుల నివ్వటమేగాక ఇంకేమన్నా కావాలన్నా ఇస్తాను" అన్నాడు. త్రిజటుడు రాముణ్ణి దీవించి ఆవుల మందలను తోలుకుని తన ఆశ్రమానికి వెళ్ళిపోయాడు.

ఈవిధంగా దానాలతో ఆబాలగోపాలాన్ని తృప్తి పరచి రాముడు సీతా లక్ష్మణులతో తండ్రి నగరుకు బయలుదేరాడు.

వారు ముగ్గురూ వీధులవెంబడి పోతుంటే మేడల మీది నుంచీ, మిద్దెల మీది నుంచీ

ఒక వృద్ధ వేద పండితుడికీ, దశరథుడికి ఇష్టుడైన చిత్రరథుడనే సారథికీ, బ్రహ్మచారులకూ అంతులేని గోవులూ, బంగారమూ, మణులూ, బట్టలూ దానం చేశాడు.

అయోధ్యకు సమీపంగా అరణ్యంలో ఒక ముసలి బ్రాహ్మణుడుండేవాడు. ఆయన పేరు త్రిజటుడు. ఆయనకు గంపెడు పిల్లలూ, పడుచు భార్యా ఉన్నారు. ఆయన పరిగ ఏరుకునీ, కందమూలాలు తవ్వుకునీ సంసారం నెట్టుకొస్తున్నాడు.

రాముడు యాత్రాదానాలు చేస్తున్న మాట ఎలాగో తెలిసి త్రిజటుడు, చిరిగిన పై బట్ట కప్పుకుని రాముడి వద్దకు వచ్చి,



చూసే పౌరులకు కడుపు మండిపోయింది. వాళ్ళు రకరకాలుగా తమలో తాము మాట్లాడుకున్నారు:

"చూడండర్రా, రాముడు కాలినడకను భార్యనూ, తమ్ముణ్ణీ వెంటబెట్టుకుని ఎలా పోతున్నాడో! కాకపోయినా ఈ దశరథుడి కేదో దయ్యం పట్టినట్టుంది. ఎంత దుర్మార్గుడైన కొడుకునైనా రాజైనవాడు అడవులకు పంపడుగదా, బంగారంలాటి రాముణ్ణి అడవికి పంపిస్తున్నాడే! మన మందరమూ కుటుంబాలతో సహా రాముడి వెంట పోతే రోగం వదిలిపోతుంది!"

పౌరులు గట్టిగా అనుకునే ఈ మాటలన్నీ వింటూ సీతా రామలక్ష్మణులు దశరథుడి నగరు చేరి, సుమంత్రుడి ద్వారా తాము ఆయనను చూడవచ్చినట్టు రాజుకు కబురు చేశారు.

దశరథుడు సీతా రామలక్ష్మణులను పిలుచుకురమ్మని సుమంత్రుడితో అన్నాడు.

చేతులు జోడించి వచ్చే రాముడు కనబడగానే దశరథుడూ, ఆయన అంతఃపుర స్త్రీలూ లేచి నిలబడ్డారు. దశరథుడు రాముడి కెదురు పోబోయి మధ్య దారిలోనే పడిపోయాడు. ఆయనను ఎత్తి పాన్పుపై పడుకోబెటారు.



స్పృహ వచ్చి దశరథుడు కళ్ళు తెరవగానే రాముడు, "మహారాజా, నేను దండకారణ్యానికి పోతున్నాను. మీరు ప్రభువుగనక మీ అనుమతి కోసం వచ్చాను. నేనెంత చెప్పినా వినక సీతా లక్ష్మణులు నా వెంట బయలు దేరారు. వారి వనవాసానికి కూడా అనుమతి ఇవ్వండి," అన్నాడు.

దశరథుడు రాముడితో, "నాయనా, రామా! కైకేయికి వరమిచ్చి నేను మోసపోయాను. నీవు నా ఆనతి అతిక్రమించి పట్టాభిషేకం చేసుకో!" అన్నాడు.

"మీరు అసత్యదోషం కట్టుకోకండి. అడవికి పోవటానికి నా కేమీ అభ్యంతరం





లేదు. పద్నాలుగేళ్ళూ సుఖంగా వనవాసం చేసి మళ్ళీ మీ దగ్గిరికి వస్తాము," అన్నాడురాముడు.

"మీరు ఇవాళే వెళ్ళాలని ఏమిటి? ఈ రాత్రికి ఇక్కడ ఉండి నా వల్ల మీకు కావలిసిన వన్నీ పొంది, ఈ ఒక్క రాత్రి మమ్మల్నందరినీ సంతోష పెట్టి, రేపు ఉదయం అరణ్యానికి బయులుదేర వచ్చు," అన్నాడు దశరథుడు.

"తండ్రీ, మా కోరికలన్నీ మీరు తీర్చి నట్టే భావించి మమ్మల్ని వెళ్ళ నివ్వండి. మాకు మీ ఆశీర్వాదం ఇచ్చి సంతోషంగా పంపండి. అరణ్యంలో మా కేమీ కష్టాలుండవు. అనేక పర్వతాలూ, సరస్సులూ, వింతలూ చూస్తాం," అన్నాడు రాముడు.

రాము డడవికి పోతున్నందుకు దశరథుడు పొందే సంతాపం చూసి సుమంత్రుడు పట్టరాని ఆగ్రహం వచ్చినవాడై, కళ్ళ నిప్పులు రాలుస్తూ, పళ్ళు పటపట కొరుకుతూ, కైకేయితో, "దుష్టురాలా! నిన్ను ప్రాణంకన్న ఎక్కువగా చూసుకునే మహారాజు కింత శోకం తెచ్చిపెట్టావే, నీ వింకేమి చెయ్యలేవు? నీ వాలకం చూస్తే భర్తను చంపుకునేదానివిగానూ,వంశనాశనం కలిగించే దానివిగానూ కనిపిస్తున్నావు. అందరిలోకీ పెద్ద కొడుకైన రాముడు పట్టాభిషేకం చేసుకోవటానికి నీ అభ్యంతర మేమిటి? భరతుడు రాజ్యం చేస్తే మేమంతా ఇక్కడ ఉంటామనుకుంటున్నావా? అయోధ్యలో ఒక్క బ్రాహ్మడుంటాడా? ఎందుకు చేస్తున్నావీ పాడుపని? మొత్తానికి ఆ తల్లి కూతురనిపించు కున్నావు! నీ తండ్రి అయిన అశ్వపతికి ఒక మునీశ్వరుడు ఒక అపూర్వమైన శక్తి ఇచ్చాడు. దానితో ఆయన పశు పక్ష్యాదుల భాషలన్నీ నేర్చుతున్నాడు. ఒకనా డాయన మంచం మీద పడుకుని ఉండగా జృంభమనే ఒక చీమ ఏదో అనే సరికి ఆయన పకపకా నవ్వాడు. అది



చూసి మీ అమ్మ, ఎందుకు నవ్వావో చెప్పు అన్నది. ఎందుకు నవ్వానో చెబితే నేను చచ్చి పోతానన్నాడు మీ తండ్రి. నువ్వు చస్తావో, బతుకుతావో నాకు తెలీదు; నన్ను చూసి నవ్వలేదని నా కేమిటి నమ్మకం? అందుచేత నవ్విన కారణం చెప్పాలిసిందే నన్నది మీ అమ్మ. అప్పుడు మీ నాన్న తనకు వరమిచ్చిన ముని దగ్గిరికి పోయి అయన సలహా అడిగాడు. నీ భార్య చచ్చి గీపెట్టినా చెప్పకు అన్నాడు ముని. అప్పుడు మీ నాన్న మీ అమ్మను వెళ్ళగొట్టి సుఖంగా ఉన్నాడు. నీ ధోరణి కూడా అలాగే ఉంది. తండ్రిని విడిచి రాముడు అడవికి వెళ్ళాడో గొప్ప ఆపద కలిగి తీరుతుంది. అందుచేత నీ వక్రబుద్ధి మాని రాముడి పట్టాభిషేకానికి ఒప్పుకో!" అని హితవు చెప్పాడు.

ఈ మాటలకు కైక సిగ్గు పడలేదు సరికదా, చలించను కూడా లేదు. దశరథుడు మాత్రం సుమంత్రుడితో, "రాముడి వెంట అడవికి చతురంగ బలాలనూ, విశేషమైన ధనాన్నీ, అందగత్తెలయిన స్త్రీలనూ, సంబారాలతో వర్తకులనూ పంపించు. బళ్లు కూడా వెంట ఇచ్చి పంపించు. రాముడికి రాజ్యం లేదన్న లోపం తెలియకుండా చూడు," అన్నాడు.



సుమంత్రుడి శాపనార్థాలకు చలించని కైకేయి ఈ మాటలు విని తెల్లబోయి, బెదిరి, గొంతు అర్చుకుపోయి, "మహారాజా, అయోధ్యను పాడు బెట్టి అందరూ వెళ్ళిపోతే భరతుడు పాలించడు!" అన్నది.

"ఓసి దుర్మార్గురాలా! నా మీద మొయ్యరానంత బరువు వేసింది చాలక ఈ కొరడా దెబ్బలు కూడా ఏమిటి? ఇదంతా ఆ వరాలలోనే చేర్చి అడగక పోయావా?" అన్నాడు దశరథుడు కోపంగా.

కైకేయి అంతకన్న హెచ్చు కోపంతో, "అది వేరే అడగాలా ఏమిటి? అరణ్యానికి పొమ్మంటే అన్నీ విడిచిపెట్టి పోవటం



కాదా? మీ పూర్వీకుడు సగర చక్రవర్తి తన పెద్ద కొడుకైన అసమంజుణ్ణి వెళ్ళగొట్టినప్పుడు వాడి వెనకగా సైన్యాన్ని పంపాడా?" అని అడిగింది.

ఈ మాట విని సిద్ధార్థుడనే మంత్రి, "అమ్మా, అసమంజుడి మాట ఇక్కడ దేనికి? వాడు పరమ దుష్టుడు. వాడు వీధుల్లో ఆడుకునే పిల్లలను తీసుకుపోయి సరయూ నదిలో పడేసి వాళ్ళు ఎలా చస్తారో చూసి ఆనందించే పాపాత్ముడు. అందుచేత పౌరులు కడుపుమంటతో రాజువద్దకు వెళ్ళి, 'అయ్యా, తమరు అసమంజుణ్ణి వెళ్ళగొడతారా, మమ్మల్ని దేశం విడిచి వెళ్ళి



పొమ్మన్నారా? ఏదో ఒకటి తేల్చి చెప్పండి!' అని అడగగా సగర మహారాజు జనద్రోహి అయిన తన కొడుకునూ, వాడి భార్యనూ, పరివారాన్నీ వెళ్ళగొట్టి, వాణ్ణి తిరిగి రాజ్యంలో అడుగు పెట్టనివ్వ వద్దని కట్టుదిట్టం చేశాడు. జనద్రోహి అసమంజుడికీ జనప్రియుడైన రాముడికీ సాపత్యం చెప్పావే!" అన్నాడు.

ఈ మాటలకు కైక చలించక పోవటం చూసి దశరథుడు, "ఓసి పాపాత్మురాలా! నిన్ను చూస్తే నీకు హితం తల కెక్కేటట్టు లేదు. నేను కూడా రాముడి వెంట అడవికి పోతాను. నీవూ, భరతుడూ సుఖంగా రాజ్యమేలండి," అన్నాడు.

ఈ సంభాషణ అంతా వింటున్న రాముడు తండ్రితో, "మహారాజా, అన్ని సుఖాలూ విడిచి, అడవిలో కందమూలాలు తినబోయే నా వెంట సేన కూడా దేనికి? ఏనుగును దానం చేసి కట్టుతాడు దగ్గిర లోభించే పద్ధతి మానండి. మాకు నారబట్టలూ, దుంపలు తవ్వుకునే పరికరాలూ, ఒక బుట్టా ఇప్పించండి, చాలు," అన్నాడు.

మానాభి మానాలు విడిచిపెట్టిన కైకేయి, "ఇదుగో, నారబట్టలు తెస్తున్నాను," అంటూ వచ్చింది. రామలక్ష్మణులు తమ మేలి వస్త్రాలు విప్పేసి, తండ్రి ఎదటనే నార







బట్టలు ధరించారు. సీతకు మాత్రం అవి ఎలా కట్టుకోవాలో తెలియక రాముడి కేసి చూసింది. తరవాత ఒక బట్ట మెడకు చుట్టుకుని, మరొకటి చేత పట్టుకుని, సిగ్గుతో తల వంచి నిలబడింది. అప్పుడు రాముడు చప్పున ఆమె వద్దకు వెళ్ళి, ఆమె చేతిలో ఉన్న నార చీరె తీసుకుని, ఆమె కట్టుకుని ఉన్న పట్టు చీరె పైన దానిని చుట్టాడు.

ఇది చూసి దశరథుడి భార్యలు కన్నీరు కారుస్తూ, "నాయనా, నీవు తండ్రి మాట ప్రకారం అడవికి వెళ్ళదలిచావు, వద్దన్నా మానవు. కాని సీతను కూడా ఎందుకు తీసుకు పోతావు? ఆమె వనవాసం చెయ్యాలేదు. మా వద్ద విడిచిపెట్టి వెళ్ళు, నాయనా. నీకు బదులుగా ఆమెను చూసుకుంటూ ఉంటాం," అన్నారు.

ఈ లోపల వసిష్ఠుడు సీతకు నార చీరె లిస్తున్న కైకేయితో, "గుణ హీనురాలా, నీ సాహసానికి అంతు లేకుండా ఉన్నదే. సీత అడవికి వెళ్ళవలసిన అవసరమే మున్నది? రాముడి కోసం సిద్ధం చేసిన పట్టాభిషేకం ఆమెకు జరిపి రాజ్యం పాలించేటట్టు చేయవచ్చు, తెలుసా? సీత ఈ నార చీరెలు కట్టవలసిన అవసరం లేదు సరే కదా, ఆమె తన వెంట వాహనాలూ, వస్తువులూ, బట్టలూ, పరిచారికలూ, సమస్తమూ తీసుకు పోవచ్చును. భరతుడు సంతోషిస్తాడని నీవు చేసిన ఈ దుర్మార్గం అతనికి ఎంత మాత్రమూ రుచించదు. అతను దశరథుడి కొడుకే అయితే, తన తండ్రి వ్యథకు కారణమైన రామ వనవాసానికి ఎంత మాత్రమూ సమ్మతించడు!" అన్నాడు.

చుట్టూ ఉన్నవారు, "ఛీ, ఛీ!" అనుకోవటం దశరథుడు విన్నాడు. ఆయన సీతను చూసి, "సుకుమారి, చిన్న పిల్ల! ఆ సీత మునిపత్నిలాగా నార చీరె గట్టి ఎలా వెలవెల పోతున్నదో చూడండి! ఆమె నార చీరెలు కట్టటానికి వీల్లేదు," అన్నాడు.

రాముడు బయలుదేరే ప్రయత్నంలో తండ్రికి అప్పగింతలు చెప్పి, తన తల్లి అయిన కౌసల్యను కాపాడమని కోరాడు. దశరథుడు సుమంత్రుడితో, "మంచి గుర్రాలను పూన్చిన మేలైన రథంలో వీళ్ళ నెక్కించి, నగరం బయట అరణ్యంలో విడిచి పెట్టిరా!" అన్నాడు. ధనాధికారిని పిలిచి, "పధ్నాలుగేళ్ళ పాటు సీతకు సరిపోయే మేలైన చీరెలూ, నగలూ తీసుకురా," అని ఆజ్ఞాపించాడు.

సీత పెళ్ళికి పోతున్న దానిలాగా వికసించిన ముఖంతో తన కోసం తెచ్చిన నగలు పెట్టుకుంటూంటే కౌసల్య ఆమెను రెండు చేతులా ఆలింగనం చేసుకుని, "సీతా, నీ భర్త పేదవాడై పోయినాడని వనవాస కాలంలో అశ్రద్ధగా చూడకమ్మా!" అంటూ నీతిబోధ చేసింది.

రాముడు తల్లి దండ్రులకు ప్రదక్షిణ నమస్కారం చేసి, తల్లితో, "అమ్మా దిగులు పడక తండ్రిగారిని కనిపెట్టుకుని ఉండు. పధ్నాలుగేళ్ళంటే ఎంత? కన్ను మూసి తెరిచేసరికి గడిచిపోతాయి," అన్నాడు.

లక్ష్మణుడు కూడా తల్లి దండ్రులకు మొక్కి తన తల్లి అయిన సుమిత్ర వద్ద సెలవు తీసుకున్నాడు. ఆమె, "లక్ష్మణా, ఇక నీకు రాముడే తండ్రి, సీతే తల్లి, అరణ్యమే అయోధ్య! అన్నను ఆపద రాకుండా చూసుకో, నాయనా!" అని చెప్పింది.

ముగ్గురూ బయటికి వచ్చారు. పెళ్ళికూతురులాగా అలంకరించుకున్న సీత తాను వనవాసం వెళుతున్నాననే చింత కొంచెమైనా లేకుండా, ముందుగా రథమెక్కి కూచున్నది. తరవాత రామలక్ష్మణు లెక్కి కూచున్నారు.

సుమంత్రుడు రథంలో సీతకు దశరథుడిచ్చిన వస్త్రాభరణాలూ, ఆయుధాలూ, కవచాలూ, చిన్న గునపమూ, బుట్టా ఉంచాడు. రథం కదిలింది.



# 3. ఖియాప్స్ పిరమిడ్

ప్రపంచాద్భుతాలని పేరు పొందిన పిరమిడ్లన్నిటిలోకీ ఖియాప్స్ పిరమిడ్ పెద్దది. దీని దిగువ భాగం నిడివి ఎటు చూసినా 746 అడుగులు. సుమారు 13 ఎకరాల మేర ఆక్రమించి ఉన్నది. దీని ఎత్తు 450 అడుగులు. రెండున్నరటన్నుల బరువుగల కొండరాళ్ళు 23 లక్షలు దీని నిర్మాణానికి ఉపయోగించారు. ఇది ఈజిప్టులో ఉన్నది.





# ప్రశ్నోత్తరాలు

1. బి. రామయ్య, హైదరాబాదు

పాఠకుల లేఖలు, ప్రశ్నోత్తరాలు, మరియు ఫొటో వ్యాఖ్యలు ఒకే కవరులో పెట్టి పంప వచ్చునా ?

పంపవచ్చును, కాని దేనికది వేరువేరు కాగితాలమీద రాయాలి. ప్రతి కాగితంమీదా పేరూ, చిరునామా రాయాలి. రోజువారీగా వచ్చే ఉత్తరాలను పాఠకుల లేఖలకిందా, ప్రశ్నలకిందా, ఫొటో వ్యాఖ్యలకింద వేరు చేసి ఫైలు చేస్తాము. అందుకే ఒకే కార్డు మీద వేరు వేరు శీర్షికల రచనలు పంపవద్దని చాలాసార్లు కోరాము. అయినప్పటికీ అనేకమంది ఒక కార్డుపై ఫొటో వ్యాఖ్యలూ, ప్రశ్నలూ, పాఠకుల లేఖలూ రాస్తున్నారు. వీటిని మేము ఒకేసారి పరిశీలించము గనుక ఇందువల్ల పాఠకులకే నష్టం.

2. వై. డిల్లీరావు, కవిటి

అన్ని పత్రికల కన్న "చందమామ"కు మిక్కిలి వన్నె రావటానికి కారణ మేమిటి ?

"చందమామ" గనక !

3. వోలేటి సూర్యప్రకాష్, నల్లగొండ

"గుండు భీమన్న" రచయిత ఎవరు ? అన్న ప్రశ్నకు "తెలియదు", అని సమాధాన మిచ్చారు. ఎవరో తెలియకపోతే మీరు ఎలా ప్రచురించారు ?

గుండు భీమన్న కథలు కన్నడ జనసాహిత్యానికి చెందినవి. అసలు కథకు డెవరో తెలియదు. వాటిని మా సంపాదక వర్గంలోవారే తెలుగులోనూ ఇతర భాషలలోనూ రాస్తున్నారు.

4. డి. ముకుందరాజు, వరంగల్లు

బేతాళుడు ఒక్క రాత్రిలోనే ఇన్ని కథలు చెప్పుచున్నాడా, అన్నగారు ?

బేతాళ కథలలో ఎవరైనా వాస్తవికత కోసం చూస్తారా ?

5. ఖుర్షీద్ బేగం, బందరు

మాకున్న సందేహాలు కార్డుద్వారా పంపవచ్చునా ?

పంపవచ్చు.

6. బి. మణిరాజి, సామర్లకోట

మామా, ఫొటో వ్యాఖ్యలు 2, 3 ఒకే కార్డుపై వ్రాయచ్చా ?

పన్నెండు పదమూడు కూడా రాయొచ్చు, చాతనైతే! కాని కొందరు ఒకే జంట వ్యాఖ్యలకు రెండు కార్డులు ఉపయోగిస్తున్నారు. ఇవి ఒకేచోట కలవటం చాలా కష్టం, వారికి నష్టం.

7. జి. జయరామరెడ్డి, కనిగిరి

"రాకాసిలోయ" యింకా ఎంతవరకు వేసెదరు ?

1962 ఆఖరుకు అయిపోతుంది.

8. టి. కల్యాణి, హైదరాబాదు

ఈ నెల నుంచి చిత్రకథ వేయలేదు ఎందుకు ? ఆ కథలు చాలా బాగుంటాయి.

చిత్రకథ కొందరికి చాలా బాగుంటున్నది, మరి కొందరికి అంత బాగుండటం లేదు. అందుచేత వాటిని నిలిపివేశాం.

9. బి. శకుంతలారెడ్డి, బుచ్చిరెడ్డిపాళెం

స్నేహితుని కోసము తన కొడుకులను బలి ఇచ్చేవారు ఈ రోజులలో ఉన్నారా ?

అటువంటి దారుణ పరిస్థితి ఈ నాడు ఏర్పడదు ; ఏర్పడినా చట్టం ఒప్పదు. భర్తలు పోయినాక ఆత్మహత్యలు చేసుకునే స్త్రీలు ఈ కాలంలో లేరా? చట్టం ఒప్పితే వారు సహగమనం చేసేవారేగద! స్నేహితుల కోసం త్యాగం చేసేవారు ఏ కాలంలోనూ ఉంటారు.

10. వి. ఆర్. శేఖర్, చేబ్రోలు

గుండు భీమన్న కథలలాటివి మేముకూడా వ్రాసి పంపితే ప్రచురిస్తారా ?

సంతోషంగా ప్రచురిస్తాము. కాని అవే కథలు తిరగ రాసి పంపవద్దు.

Photo by Sundara Murthy



బహుమతి
పొందిన వ్యాఖ్య

నాకు నేనే సాటి!

పంపినవారు:
ఎన్. ఆర్. ఎస్. ప్రకాశ్, తిరుపతి

Photo by D. I. Chanthamian



బహుమతి
పొందిన వ్యాఖ్య

పోటీ ఎవరు మా తోటి?

పంపినవారు:
ఎస్. ఆర్. ఎస్. ప్రకాశ్, తిరుపతి

# జరిగే పని కాదు ★

[రామతీర్థ కథ]

ఒక ధనికుడు ఎంతో శ్రమపడి పెట్టెలకు పెట్టెలు బంగారం పోగుచేశాడు. ఒకనాడు ఒక సన్యాసి ఆయన ఇంటికి వచ్చి, "ఎందు కిలా బంగారాన్ని ఇనప పెట్టెల నిండా, కొయ్యపెట్టెల నిండా చేర్చుతున్నావు?" అని అడిగాడు.

"స్వామీ, తమవంటి వారికి ఎక్కడ పడితే అక్కడ భిక్షలు దొరుకుతాయి. నాబోటి గృహస్థుకు తిండి లేని పరిస్థితి ఏర్పడితే ఏం కావాలి? అందుచేత ముందే జాగ్రత్త పడుతున్నాను," అన్నాడు ధనికుడు.

సన్యాసి ఈ మాట విని ఏమీ అనక వెళ్ళి పోయాడు. ఆ సాయంకాలమే ధనికుడు సన్యాసి ఉండే కుటీరానికి వెళ్ళాడు. సన్యాసి ఒక గొయ్యి తవ్వుతున్నాడు. పక్కనే ఒక గులకరాళ్ళ కుప్ప ఉన్నది.

"స్వామీ, మీ రేమిటి చేస్తున్నారు?" అని ధనికుడు అడిగాడు.

"ఈ గులకరాళ్ళు ఎంత అందంగా ఉన్నాయో చూడు. వీటిని దాచిపెట్టుకుంటున్నాను. ఎప్పటికైనా వీటితో అవసరం రావచ్చు," అన్నాడు సన్యాసి.

"అదేమిటి, స్వామీ? కొండనిండా ఇలాటి రాళ్ళున్నాయి గదా, వీటిని దాచటం దేనికి?" అన్నాడు ధనికుడు.

"గాలివాన వచ్చి కొండలన్నీ కొట్టుకుపోతే?" అన్నాడు సన్యాసి.

"అది జరిగే పనిగాదు. ఆ సంగతి మీకూ తెలుసు!" అన్నాడు ధనికుడు.

"మూర్ఖుడా, నీకు తిండి దొరకకుండా పోవటమనేది జరగదని నీకు మాత్రం తెలియదా? ఆ బంగార మంతా ఎందుకు పోగుచేశావు?" అని సన్యాసి ధనికుణ్ణి కసిరాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1962 ఏప్రిల్ సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఫిబ్రవరి నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

---

### ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: నాకు నేనే సాటి!

రెండవ ఫోటో: పోటీ ఎవరు మా తోటి?

పంపినవారు: ఎస్. ఆర్. సూర్యప్రకాశ్,

C/o. డాక్టర్ ఎస్. వి. రామకృష్ణగారు, తిరుపతి.

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# అట్టచివరి బొమ్మ

పాండవ శిబిర ద్వారానికి అడ్డంగా నిలబడిన భూతాన్ని జయించలేక, నిరాయుధుడై పోయిన అశ్వత్థామ శివుణ్ణి ధ్యానించాడు. శివుడి అనుగ్రహం చేత ఒక బంగారు వేదిక వెలిసింది. దానిపై అగ్ని ప్రజ్వలించింది. ఆ అగ్నిలో నుంచి శైవగణాలు బయలుదేరాయి.

అశ్వత్థామ శివుణ్ణి ధ్యానిస్తూ, తన శత్రువులను నిర్మూలించే కోరిక నెరవేర్చమని వేడుకుంటూ ఆ అగ్నిలో దూకాడు. అప్పుడు శివుడు ప్రత్యక్షమై, "నిన్ను పరీక్షించటానికి నేనే ఆ భూతాన్ని కల్పించాను. నీ శత్రువులకు కాలం తీరిపోయింది. వారిని సంహరించు," అంటూ అశ్వత్థామకు ఒక కత్తి నిచ్చి, అతనిలో తానే ప్రవేశించాడు.

శిబిర ద్వారం వద్ద కృపుణ్ణీ, కృతవర్మనూ వుంచి, బయటి నుంచి శిబిరంలోకి ఎవరూ రాకుండా చూడమని హెచ్చరించి, అశ్వత్థామ శిబిరంలోకి ప్రవేశించాడు. యోధులందరూ గాఢ నిద్రలో వున్నారు. అశ్వత్థామ ముందుగా ధృష్టద్యుమ్నుడుండే చోటికి వెళ్ళాడు. చక్కని పక్కపై సుఖ నిద్రలో వున్న ధృష్టద్యుమ్నుణ్ణి కాలితో ఒక్క తన్ను తన్నాడు. ధృష్టద్యుమ్నుడు లేస్తూండగానే అతని జుట్టు పట్టుకుని కదలకుండా తొక్కిపట్టి అతన్ని అతి క్రూరంగా చిత్రవధ చేశాడు.

అశ్వత్థామ అక్కడినుంచి బయలుదేరి శిబిరమంతా మృత్యువిహారం చేశాడు. అతను నిద్రపోతున్నవారినీ, నిద్ర లేచి తన పైకి వచ్చినవారినీ, ఒక్కణ్ణి మిగల్చకుండా వధించాడు. అతని చేతిలో ఉత్తమౌజుడూ, యుధామన్యుడూ చచ్చారు. శరీరం నిండా రక్తమై చూడటానికి భూతమో, రాక్షసుడో అన్నట్టున్న అతన్ని చూసి భయపడి కొందరు పారి పోయారు.

ప్రతివింధ్యుడూ, సుతసోముడూ, నకులుడి కొడుకు శతానీకుడూ, శిఖండీ, విరాటుడి కొడుకులూ, మనమలూ, ద్రౌపది కొడుకులూ, అనేక వేల మంది పాంచాల, సృంజయ యోధులూ అతనితో పోరాడి చచ్చిపోయారు. కొందరు యోధులు చావుకు వెరచి శిబిరం విడిచి పారిపోవటానికి యత్నించారు. వారిని కృప కృతవర్మలు చంపేశారు. అంతేగాక, అశ్వత్థామకు వెలుతురు వుండటానికని వారు పాండవ శిబిరానికి మూడు మూలల నిప్పుపెట్టారు.

ఈ విధంగా అర్ధరాత్రి లోపుగా అశ్వత్థామ పాండవ శిబిరంలో మిగిలిపోయిన యోధులనూ, ఏనుగులనూ, గుర్రాలనూ సయితం నిశ్శేషంగా చంపేశాడు. ఆ రాత్రి పాండవులు శిబిరంలో వున్నట్టయితే ఈ ఘోర హత్యాకాండ జరిగి వుండేదికాదు.

అశ్వత్థామ ప్రతిజ్ఞ నెరవేరింది. అతను తన తండ్రి చావుకు పగ తీర్చుకుని, దుర్యోధనుడికి చేసిన ప్రతిజ్ఞ నిలబెట్టుకున్నాడు. అతను కృపకృతవర్మలను చేరుకుని తన పని పూర్తి అయిందని చెప్పాడు. వారిద్దరూ అతన్ని కౌగలించుకుని అతని నుంచి తప్పించుకున్న వారిని తాము చంపినట్టు చెప్పారు. "మనము వెళ్ళి, రాజు ఇంకా ప్రాణాలతో వుంటే అతని చెవిని ఈ వార్త వేద్దాం!" అన్నాడు అశ్వత్థామ కృప కృతవర్మలతో.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'



"గుండమ్మ కథ"లో

కామిక్ విలన్



"గుండమ్మ కథ"లో

సీరియస్ విలన్

